చిరస్మరణీయుడయ్యాడు.

పోలీస్ స్టేషన్లో ప్రకాశం స్టేషన్ అధికారితో అప్పటివరకూ జరిగిన ప్రతివిషయమూ పొల్లుపోకుండా వివరించి "అనుకోకుండా జరిగిన సంఘటనకు తను కూడా బాధపడుతున్నానని అందుకే నా పందెం డబ్బులు వందా తనకు ఇస్తాను" అంటాడు.




కథలో ఇక్కన్నుండి ప్రకాశం పాత్ర నిజంగానే ప్రకాశించడం మొదలవుతుంది. ఆనాటి కాలంలో రచయితలు, కవులు తమ ప్రతి రచనా శీర్షికకు పెట్టే పేరులోనే ఆ రచన యొక్క సారాంశం అర్థమయ్యేటట్టు పెట్టేవారు. అందుకు నిదర్శనం ప్రకాశం వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించేందుకే రచయిత శ్రీపాద ఆ పేరు పెట్టి వుంటాడు. అంతేకాదు కథా శీర్షికకు 'తులసి మొక్కలు' అని పేరు పెట్టడంలోను, కథానాయికి రంగనాయికి మనస్తత్వాన్ని, పాత్ర ప్రత్యేకతను పాఠకుల దృష్టిలో గొప్పగా ఆవిష్కరింపజేశాడు.

కానీ, ఇప్పటి డిజిటల్ యుగంలో అటువంటి విధానాన్ని రచయితలు, కవులు పూర్తిగా వదిలిపెట్టడమే కాదు. రచనా సారాంశాన్ని శీర్షికలోనే రచయితలు చెప్పినట్టయితే పాఠకులు కథాంశాన్ని మొత్తం అర్థం చేసుకుని సమయం వృధాచేసుకోవడమెందుకని అసలు చదవడమే మానేస్తున్నారు. అందుకే ఇప్పటి రచనా శీర్షికలకు, వస్తువుకు ఎటువంటి సంబంధం వుండకుండా చూస్తున్నారు. కాలాను గుణంగా అన్నిరంగాలలోనూ మార్పులు అనివార్యమే అయినట్టుగా ఆ మార్పు సాహితీ రంగంలోనూ ప్రవేశించిందన్న అంశం ఈ కథలో మనకు స్ఫుటంగా కన్పిస్తుంది.

ప్రకాశం పూర్తి వివరాలు వ్రాసుకున్న పోలీసులు అతణ్ణి మరునాడు స్టేషన్‌కి రావాలని చెప్పి పంపుతారు.

అదే సమయంలో అక్కడ రంగనాయిక ఇంట్లో అమ్మ, అక్కలు కలిసి మన కులాచారం ప్రకారం నువ్వు మన వృత్తిని ఆశ్రయించి సుఖంగా బతుకు, నీకు కన్నెచెర విడిపించడానికి షావుకారు ఎనిమిదివందలు ఇస్తానంటున్నాడు" అంటూ ఆవిడ బుర్రను తినెయ్యసాగారు.

వాళ్ళ మాటలను అర్థం చేకున్న రంగనాయిక కండ్ల ముందు వృద్ధ బ్రాహ్మణ వితంతువు అన్న మాటలు చెవుల్లో మారుమ్రోగుతుండగా "అవసరమైతే నేను ఎవరింట్లోనన్నా పనిమనిషిగానైనా చేరి గౌరవంగా బ్రతుకుతాను తప్ప నేను మన వృత్తిలోకి దిగను" అంటూ తన మనసులోని మాటను తెలియజేస్తుంది.

అన్నట్టే ప్రకాశం మీద కేసుపెట్టిన పోలీసులు నేరుగా కళాశాలకే వచ్చి అతనికి నోటీస్ జారీచేసి వెళతారు. ఇక ఇక్కడ నుండి కథను విలక్షణమైన మలుపు తిప్పాడు కథకుడు శ్రీపాద. ఆ కళాశాలలోనే కందుకూరి వీరేశలింగంపంతులు గారు ఉపన్యాసకులుగా పనిచేస్తుంటారు. ఆయన దృష్టికి విషయం వెళ్ళడంతో వారు ప్రకాశంతో మాట్లాడి జరిగిందంతా తెలుసుకున్న మీదట "కేసు పాడూ లేకుండా నేను చూసుకుంటాను. గాని నువ్వో పని చేస్తావా?" అంటూ అడుగుతారు.

అన్నట్టే ప్రకాశం మీద కేసుపెట్టిన పోలీసులు నేరుగా కళాశాలకే వచ్చి అతనికి నోటీస్ జారీచేసి వెళతారు

దానికతను "సరే" అంటాడు.

పంతులుగారు మొత్తం విషయాన్ని కళాశాల ప్రిన్సిపాల్ గారికి వివరించి ఆ సమస్యను తాను పరిష్కరిస్తానని భరోసా కూడా ఇస్తాడు.

పంతులుగారు వెంటనే వేశ్య మాత రాజామణికి కబురు చేసి ఆ రాత్రి పదిగంటలకు ఎవరికంటా పడకుండా తన బిడ్డలతోపాటు వచ్చి తనను ఎక్కడ కలవాలో వివరాలు తెలియజేస్తాడు.

అనుకున్న ప్రకారం వచ్చిన రాజామణి వాళ్ళతో తన మనసులోని ఆలోచనను వివరించి, పని జరిగేంత వరకు ఈ రహస్యం ఎక్కడా పొక్కకూడదని ఒప్పిస్తాడు.

అనుకున్న ప్రకారం అనుకున్న రోజు అనుకున్న సమయానికి పంతులుగారు ప్రకాశంతోపాటు మరికొందరు ముఖ్యులను వెంటబెట్టుకొని రాజామణి ఇంటికి చేరుకుంటారు. వాళ్ళు కూడా అప్పటికి చేయవలసిన పనులన్నీ చేసి వీరికోసమే ఎదురు చూస్తుంటారు.

దాంతో పంతులుగారే పురోహితుడై రంగనాయికకు అనాధ అయిన ప్రకాశానికి పెండ్లి చేస్తారు. పెండ్లికి వచ్చిన వారంతా వధూవరులను ఆశీర్వదించి కానుకలు అందించి వెళతారు.

కథకుడుగా శ్రీపాద ఆనాటి సంఘసంస్కర్త అయిన వీరేశలింగంగారిని కథలో పాత్రగా మలిచి వారి చేత భోగం కులంలో పుట్టినప్పటికీ వారి వృత్తికి దూరంగా వుంటూ పెండ్లి చేసుకుని గౌరవంగా తులసిమొక్కలా పవిత్రంగా బతకాలనుకున్న రంగనాయికికీ అదేవిధంగా బీదవాడు, అనాధాయిన బ్రాహ్మణయువకుడు ప్రకాశానికీ వివాహం చేయించడం ఎంతో ఆదర్శంగా వుంటుంది.

అట్లా కందుకూరినే ప్రధానపాత్రగా ఎంచుకుని కథను రసకందాయంలో పడవేసిన శ్రీపాద ఒక కథకుడుగా తన ప్రత్యేకత ఎటువంటిదో చెప్పకనే చెప్పినట్టయ్యింది.

> కథలో రంగనాయిక వయసు ఇక పేరాలో పద్నాలుగేండ్లుగా చెప్పిన కథకుడు

కథలో రంగనాయిక వయసు ఇక పేరాలో పద్నాలుగేండ్లుగా చెప్పిన కథకుడు మరుసటి పేరాలోనే ఆవిడ వయసును పదహారుగా పేర్కొనదం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈపొరపాటు నిజంగా రచయితదా లేక కథను తిరిగి ముద్రించడం కోసం డిటిపి చేయిస్తున్నప్పుడు ఆపరేటర్ తప్పిదమా తెలియదు.

అలాగే మనసులోపలి మాటలో శ్రీపాదవారి మరణతేదీకూడా తప్పుగా పేర్కొనటం ఇబ్బందిగా అనిపిస్తుంది.

కథలో పంతులుగారి సమక్షంలోకి బోగం రాజామణి కూతుళ్ళతో వచ్చిన సందర్భంలో పంతులుగారు వారిని తన ఎదురుగావున్న కుర్చీల్లో వాళ్ళను కూర్చోమంటారు. దానికి వాళ్ళు ఒప్పుకోరు. ఆ సందర్భంలో పంతులుగారు "ఇంగ్లీష్ దొరతనం రాబట్టిగాని లేకపోతే మనం యింకా అధోగతిపాలై వుందుము" అంటూ మాట్లాడడం ఇప్పటి పాఠకులకు అంతగా నచ్చకపోవచ్చును. కానీ పోల్చి చూసుకుంటే 'అతనికంటే ఘనుడు ఆచంట మల్లన్న' అన్నట్టుగా వుంది నేటి మన స్వాతంత్ర్యభారతదేశ రాజకీయనాయకుల వ్యవహారసరళి. అవినీతి, ఆశ్రితపక్షపాతంతో దేశాన్ని భ్రష్టు పట్టిస్తున్నారు. కాబట్టి ఆయన మాటలను తప్పుపట్టలేమనిపిస్తుంది.

తెలుగునాట అక్షరంతో సమాజరుగ్మతలను బాపటానికి కలంతో శ్రమించిన ప్రాతఃస్మరణీయులు ముగ్గురు వారిలో మొదటివారు కందుకూరి వీరేశలింపంగంతులు గారు రెండవవారు గురజాడ అప్పారావుపంతులు గారు, మూడవవారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. వీరిలో వీరేశలింగంగారి కన్నా గురజాడవారు 14 ఏండ్లు చిన్నవారు. గురజాడవారి కన్న శ్రీపాద వారు 29 ఏండ్లు చిన్నవారు. వీరు ముగ్గురూ వారి వారి కాలాల్లో ఎవరికి వారే ఉద్ధండులు. వారి నివసించిన నాటి సమాజంలోని అనేక రుగ్మతలకు తమ తమ కలాలతో, విప్లవాత్మకమైన ఆలోచనలతో కాయకల్ప చికిత్సచేయాలని తీవ్రంగా పరిశ్రమించినవారు.

> తెలుగునాట అక్షరంతో సమాజరుగ్మతలను బాపటానికి కలంతో శ్రమించిన ప్రాతఃస్మరణీయులు ముగ్గురు వారిలో మొదటివారు కందుకూరి వీరేశలింపంగంతులు గారు

సంఘ సంస్కరణల విషయంలో ఈ ముగ్గురినీ మనం కందుకూరిని తాత గాను, గురజాడను కొడుకుగాను, శ్రీపాదను మనవడి



గానూ పోల్చిచూసుకుంటే మనకు వారు చేసిన సేవ ఎంత గొప్పదో అర్థమవుతుంది. తాత తెలుగునాట మొట్టమొదటి సంఘ సంస్కర్త. ఆయన తన కాలం కన్నా ఎంతో ముందుకు వెళ్ళి ఎన్నెన్ని విప్లవాత్మకమైన చర్చలు చేపట్టాడో తల్చుకుంటే ఆశ్చర్యంతో తలమునకలైపోతాము. ఆయన తరువాతి వాడయిన గురజాడ తండ్రి అడుగుజాడల్లో నడిచే కొడుకు మాదిరిగా ఆ సంస్కరణవాద ఒరవడిని ఒడిసిపట్టుకుని తన రచనల్లో ఎంతో ఆధునికంగా ఎత్తిచూపాడు. ఆ తాత, తండ్రుల వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న మనవడుగా శ్రీపాద, వారు ఏర్పరచిన సంస్కరణవాద సాహిత్యపు రహదారిలో మరింత విస్తృతంగా ఎవ్వరికీ అందనంత ఎత్తుకు దూసుకుపోయాడు. 'అరికాళ్ళ కింద మంటలు' వంటి కథతో మంటలు పుట్టించిన వాడు శ్రీపాద.

ఈ "తులసి మొక్కలు" కథను ఇప్పుడు చదవడం, విశ్లేషించడం తప్పకుండా కొత్త అనుభూతికి తలుపులు తీసినట్టుగావుంది.





'తెలుగులో విజ్ఞానం కలిగించే వాఙ్మయం నిర్మించాలి. నోరు విప్పితే ఉద్రేకం పుట్టించే ఉపన్యాసం చెయ్యాలి. నడుంకట్టితే ఫలితం యిచ్చే కార్యక్రమం నెరవేర్చాలి.'

- శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

మేటి కథలు-లోతు వ్యాఖ్యలు

# ఓ పువ్వు పూసింది



కీ.శే. శ్రీ గుడిపాటి వెంకటచలం



అర్ధరాత్రి అడివిలో పువ్వు పూసింది. చుట్టూ చీకటిని చూసి, భయమేసి, 'అమ్మా' అని ఏడ్చింది. ఆకులూ, తొడిమలూ దగ్గరగా తీసుకుని భయం లేదని పూయించాయి ఆ తెల్లని పసి పువ్వుని.

"ఏదీ?" అంది పువ్వు.

"ఎవరు?" అంది తల్లి తీగ చీకట్లోంచి.

"నన్ను నీ దగ్గిరికి తీసుకు వొచ్చాడూ – అతను."

"ఎవరు తీసుకొచ్చారు? నేను తెచ్చుకున్నాను నిన్ను; నా గారాబాన్ని, నా బంగారాన్ని, నా ముద్దుల మురిపాన్ని, నిన్ను."

"నువ్వేనా? ఎవరో అనుకున్నాను. నువ్వేనా నా చేతిని పట్టుకుని నక్షత్రాల మధ్యనించి ఆడుతో, నవ్వుతో, అట్లా తెలివొచ్చి నన్నిక్కడ దించింది? ఓసారి కనపడు!"

"తెల్లారనీ, నన్ను చూద్దుగాని, ఇప్పుడు పడుకో."

"భయమేస్తోంది. కిందికి పడిపోతానా?"

"ఆకలేస్తోంది అమ్మా!"

పువ్వునోట్లోకి వెచ్చగా, తియ్యగా, వొంటినంతా సంతోషంతో నింపుతో పాలు వొచ్చాయి.

"వొచ్చావా?" అని వొళ్ళో పెట్టుకుని పూసింది గాలి.

"అమ్మా! ఏమిటి అట్లా పాకుతోంది నా వెనక?"

"ఏం లేదు; అది పాము. తిండి కోసం తిరుగుతోంది."

"నన్ను తింటుందా?'

"నిన్నెందుకు తింటుంది? చాలా మంచిది. పిట్ట పిల్లల్ని తింటుంది! మన జోలికి రాదు."

పెద్ద పెద్ద చెట్ల వెనక నించి అర్థచంద్రోదయ మౌతోంది. కళ్ళు పెద్దవిగా విప్పింది, పువ్వు. చెట్ల కొనలు మెరుస్తున్నాయి. నేల మీద సందుల్లోంచి ధారలుగా వెన్నెల పాకుతోంది, చీకటిని పక్కలకి తీసుకుంటో, చుట్టూ అడివిని చూసి–

"చూడు, అమ్మా! చూడు" అంటో చప్పట్లు కొట్టి ఆడింది పువ్వు.

నిద్ర కళ్ళతో పాడుతోంది తల్లి.

తలెత్తి తల్లివంక చూసింది.

"ఎంత అందంగా వున్నావు అమ్మా!"

తన కళ్ళకి అందక తల్లిని తీగెలు చీకట్లలోకి పెనవేసుకున్నాయి. పరిమళాలలో విరబోసుకుని నల్లని నీడల్లో వూగుతున్నాయి ఆకు గుబుర్లు.

"ఎవరి మీద నమ్మా కావిలించుకుని అల్లుకున్నావు? అతనెవరు – గంభీరంగా అట్లా నుంచున్నాడు నీ బరువు మోస్తో?"

"మీ నాన్న!"

"అమ్మా, అమ్మా, అమ్మా! ఎవరు అట్లా కిరకిరమంటారు? అమ్మా, పట్టుకో నన్ను."

"అవి కోతులు, మీ నాన్న కోసం వొస్తాయి. నిన్నేం చెయ్యవు అవి."

"మరి నాన్న వాటిని...."

తనపేరు పిలుస్తున్నారు. పాడుతో వెన్నెలలో తేలి తనచుట్టూ మూగుతున్నారు పుష్ప కిన్నెరలు. తనెరుగును వాళ్ళని.

"పుట్టావా? నువ్వు ఇక్కడ పుట్టావా?"

– చుట్టూ మూగి, పువ్వుని కడుగుతున్నారు. రేకుల్లో చిన్న చిన్న నొక్కులు అందంగా దిద్దారు. మంచు ముత్యాల హారాలు వేశారు. వాళ్ల వెనక తనకి కనపడకుండా నీడలో ఎవరు నుంచున్నారు? తనకి తెలుసు ఎవరో! ఎప్పటెప్పటినించీ, అనంత కాలంనించి, అనేక రూపాలలో, అనేక లోకాలలో, అనేక ఆనందాలతో తనతో చెయ్యి కలిపి ఎన్నడూ తనను వొదలని ఆ నీడ ఎవరు?

తన తలపై నుంచి, చీకట్లలో నించి తియ్యని పిలుపు. దూరంగా దేని కోసమో అరుపు, ఆకులన్నీ నిలిచి వింటున్నాయి. గాలి చిన్న తరంగాలతో పులకరించింది.

ఎవరు? ఎవరు? ఎంత వెతికినా కనిపించని ఎవరు?

"అమ్మా! అమ్మా! ఎవరు?"

"కోయిల."

"ఎవర్ని పిలుస్తుంది?"

"ప్రియుణ్ణి."

"రాడేం?"

"చీకటి"

"మళ్ళీ పిలవమను."

"పిలుస్తుంది."

"ఎంత అందమమ్మా ఈ లోకం? నేనెక్కడ వున్నాను ఇక్కడికి రాక?"

పువ్వుకి ఎదురుగా, పెద్ద కాంతి పుష్పం అంధకారపు తూర్పు శాఖన వికసించి జ్వలిస్తోంది. తేలికగా తనని కప్పి నవ్వించే మబ్బు తెరలోంచి తన వెలుగు చేతుల్ని జాస్తోంది పువ్వు వేపు.

ఉత్సవాలు, వాయిద్యాలు, అరువులు, సంతోషాలు.

పూజిస్తున్నారు. తోరణాలు కడుతున్నారు. జయ జయ ధ్వానాలు చేస్తున్నారు.

ప్రతి మబ్బుకి రంగుల్ని అలంకరిస్తున్నారు. ఆత్రుతగా సంతోషాన్ని ఆపుకో లేక ఇటూ అటూ పరుగెత్తుతున్నారు. అనిల కుమారులు దుమ్ము దులుపుతూ, అందర్నీ మేలుకోమంటూ, ఎండిన ఆకుల్ని దూరంగా తోసేస్తో. చెట్లు గాలిలోకి నోళ్లు తెరుచుకొని ఆరగిస్తున్నాయి ప్రథమ భోజనాన్ని.

కాంతి, కాంతి ప్రపంచమంతా కాంతి. ఆకాశన్నంతా ఆనందంతో నింపుతో కాంతి అలలమల్లే కాంతి విరుచుకుపడుతోంది లోకం మీద.

లోకం రూపమే మారింది. సగం చందమామ నవ్వుతో నమస్కరించి ఆకాడం లోపల కరిగిపోయినాడు.

లోకం రూపమే మారింది. సగం చందమామ నవ్వుతో నమస్కరించి ఆకాడం లోపల కరిగిపోయినాడు. లోకాధిపతి వలె వెలిగిన వేగుచుక్క భయంతో ఏ మూలకో వొదిగాడు. మబ్బులు సిగ్గుతో రంగుల్ని కడిగేసుకుని, తెల్లని వొళ్లతో పక్క పక్కల ముడుచుకున్నాయి.

దేదీప్యమానమైన కాంతితో ఎర్రగా, ఎక్కడా కల్మషాన్నీ, అంధకారాన్నీ, అల్పత్వాన్నీ సహించని, క్షమించని దివ్యనిర్మల తేజస్సులు కుమ్ముకుంటో బయల్దేరాడు మార్తాండుడు.

పక్షులు రెక్కలు చాచి ఎగురుతున్నాయి. మృగాలు వొళ్లు విరుచుకుని కదులుతున్నాయి. పవన కుమారులు చెట్ల ఆకుల చివర్లలో కూచుని భయంగా చూస్తున్నారు.

సమస్తమూ మరిచి కళ్లు తెరుచుకుని చూస్తున్న పువ్వు వైపుకి తీక్షణంగా ఒక్క కిరణాన్ని విసిరాడు సూర్యుడు.

"చచ్చాను" అని కళ్లు మూసుకుంది కన్య. వొళ్లంతా వొణికింది. దెబ్బతిన్నట్టు సొమ్మసిల్లింది. తానంతా ఎర్రగా ఐపోయింది. ఒక్కసారి తన మొదట్లోంచి', నేల లోంచి పీల్చుకొని తనలోకి దిమ్మరించే అమృతంతో తానంతా నిండిపోయింది.

"అమ్మా!" అని ఒక్క అరుపు అరిచింది. భయం కాదు. సంతోషం కాదు. చావు కాదు, పుటక కాదు, నవ యవ్వనం.

తనలోకి ఆ లేత ఎండ, వెన్నెల, కింది గడ్డి నవనవ, ఆకాశంలోని నీలపు నునుపు, తన తండ్రి కొమ్మల బలం, కోయిల కంఠంలోని జాలి, గాలిలోని అర్థం లేని అల్లరి, తన తల్లి వేళ్ల కింది భూమిలోని అనర్గళసారం – అన్నీ ప్రవహించాయి.

తన రేకుల్లో తళతళలు, తన యీనెల్లో నున్నటి వుబుకు, తన బొడిపెల్లో పగలడానికి సిద్ధమైన మదపు సౌరభం, తన తొడిమలో విశాలమౌతున్న బలం, తన సమస్తంలో ఆగని, అంతులేని, కారణంలేని కాంతి.

అకస్మాత్తుగా తనని ముంచుతో, చీలుస్తో, పైన దొర్లి సముద్రము అలల మల్లే మూర్ఛలు తెప్పించే పరిమళం, తనని, తల్లిని, గాలిని ఆకాశాన్ని నింపి, పొర్లే అలలుగా, జ్వాలలుగా తనలోనించి పరిమళాలు.

పట్టలేక ఫక్కుమని నవ్వింది. ఆ నవ్వు ఎండకే కాంతి నిచ్చింది.

ఆ మత్తుకి, ఆ మాధుర్యానికి ఆకాశం కిందికి దిగిరావొద్దా? గాలి యీ వార్త ముల్లోకాలలో ప్రకటించవద్దా? ఆ కాంతి అంతా ఒకటై తనకి హారతి ఇవ్వద్దా – యీ చెట్లు, పక్షులు, కీటకాలు, మృగాలు, యీ అనంతాకాశం, సూర్యచంద్రులు యీ లోకమే తన పరిమళ సౌభాగ్యం కోసం సృష్టి పొందలేదా?

తన ముందు ఇంకెవరు?

అల్లరిగా గంతులేసింది. చప్పట్లు కొట్టింది. కళ్ళలోంచే కాంతుల్ని విసిరింది. ఎవరు అటు వెళ్ళినా ఆకుల వెనుక దాక్కుని తొంగి చూసి పకపక నవ్వింది. తనరేకుల్ని వూపింది. పరిమళాన్ని ఎక్కడా అంతం లేని భాగ్యం మల్లే విరజిమ్మింది ప్రపంచంమీద.

**అల్లరిగా గంతులేసింది. చప్పట్లు కొట్టింది. కళ్ళలోంచే కాంతుల్ని విసిరింది**

సంగీతాలతో, నృత్యాలలో సోలుతో, తూగుతో, చుట్టూ మధుపాలు సేవించి వెంబడిరాగా, పూలని లెఖ్ఖ కింద తలెత్తి చూడకుండా గర్వంగా యవ్వనంతో మదించి, వొంటినిండా పచ్చని పుష్పరజం చల్లుకుని పోతున్నాడు మధుపం.

ఎండలో రజంలో అద్ది నల్లగా మెరిసే అతని దేహం, క్రూరమైన తొండం, రక్తంవలె ఎఱ్ఱనైన కళ్ళు. గాలిని శూలాలవలె గుచ్చే పెద్ద మీసాలు చూసి వొణికింది పువ్వు.

"అమ్మా! ఎవరది?" అని తల్లి ఆకుపచ్చ పమిటలో దూరింది.

నవ్వి కూతురు తల నిమిరింది.

"నీ జోలికిరాడులే" అంది కొంటెగా తల్లి.

"రాడా? ఎంత పొగరు?" అంటూ ఆకుల్లోంచి సగం తొంగిచూసి, పరిమళాల్ని విసిరింది పువ్వు. వూపిరాడనీక మొహానికి అడ్డుపడి, రెక్కల బలాన్ని లాగేసే ఆ పరిమళానికి తల తిరిగి ఆగాడు మధుపం.

"అమ్మా! ఆగాడు" అంది భయంగా పువ్వు.

తనని ఆగనీక, నిలవనీక, ఏమిటి ఆ బాధ? తియ్యని మత్తెక్కించే ఆ వేదన ఏమిటో తనకి తెలీక, భయపెట్టి తనని తొందరచేసే ఆకాంక్ష!

తిరిగాడు తనవేపు.

పొమ్మన్నాడు అనుచరుల్ని. మళ్ళీ ఇంకోసారి కొత్త పూరజం అతని నిండా చల్లి అలంకరించి ఎగిరిపోతున్నారు మిత్రులు. చుట్టూ ఆకుల మీద వాలి నవ్వుతున్నాడ పోకిరివాళ్లు.

తనవేపు ఎగురుతున్నాడు అతను. బలంగా, ధైర్యంగా అతనికి ఎవరు ఎదురు అన్నట్టు. ఎండలో మెరుస్తో, తేలుతో, గాలిని చీల్చుకుంటో వొస్తున్నాడు అనివార్యంగా.

సిగ్గు, సిగ్గు, సిగ్గు,

తన గర్వం, తన ఆధిక్యత, విజృంభణ – ఏమీ లేవు. దాక్కుంది ఇంకా లోపలగా.

వొస్తున్నాడని భయం, సంతోషం.

తీరా రాడేమోనని దిగులు, న్యూనత.

వొస్తున్నాడని గర్వం. సిగ్గు.

ఏమిటి అంత స్వతంత్రం?

ఏమిటి ఇంత ఆలస్యం?

తను తప్ప ఇంకేం కనపడకుండా ఐ, తన చుట్టూ ప్రాధేయపడి పాడాలి.

తాను మాత్రం అందక, ఆకుల్లో, తప్పించుకుని వేధించాలి.

నర్లక్ష్యంగా, అవలీలగా ఆకుల్ని వొత్తిగించి, తనని నలుగురి ముందూ బాహాటంగా చేశాడ. క్రీగంటితో చూసి, "పో, ధూర్తుడా!" అంది. కాని తన కంఠ స్వరమేనా అది? ఏమి టా తియ్యదనం, ఆ ఆహ్వానం? తనెంత ప్రయత్నించినా తనకి లోబడని ఆ హృదయారాటం?

నర్లక్ష్యంగా, అవలీలగా ఆకుల్ని వొత్తిగించి, తనని నలుగురి ముందూ బాహాటంగా చేశాడ.

వెడల్పయిన స్వరంతో, ఝుమ్మమనే ఆ ఆపులేని ప్రేమగీతాన్ని అలాపిస్తో తన చుట్టూ తిరుగుతున్నాడు. ముందుకాళ్ళని తనవేపు జూచి, రెక్కల మీద రంగు రంగులుగా మెరుస్తో ఎండ. అతని వొంటి మీద రజపు మదపు వాసన తల తిప్పుతోంది.

పొంగివచ్చే వరదమల్లే ముంచేసింది తన కింకేం తోచకుండా ఆ మధుప గీతం. సముద్రపు హోరుమల్లే రక్తపు పోటుమల్లే.

అడుగుతున్నాడు, నవ్వుతున్నాడు, తల వొంచి ముందు కాళ్లతో ప్రాధేయపడుతున్నాడు. "నీకోసమే అనంత కాలం నుంచీ వెతుకుతున్నాను. నా ఐశ్వర్యాన్ని నీ పాదాల ముందు గుమ్మరిస్తాను. తలెత్తి ఒకసారి నావంక చూడు"! అంటున్నాడు.

అన్నీ అబద్ధాలు, కాని, ఎంత మధురమైన అబద్ధాలు!

నీ వొక్కతవే నే నాకు అన్నాడు. ఆ పుష్ప రజమంతా ఎక్కడిదో? ధూర్తుడు.

తెల్లని రేకలు మెరిపించి చిన్న నవ్వు నవ్వి దాక్కుంది, ఆకుల మధ్య, గాలి సహాయంతో.

అతను బలహీనంగా, మృదువుగా కొమ్మల్లో దాక్కునే తన కోసం, ఇంకా రాడేం? వెళ్లి పోడు కదా? మెరుస్తో, రెక్కల వూపుతో, లెఖ్క లేని పువ్వుల మధ్య పువ్వుని అనవసరమని తలవూపింది సృష్టి. రేకులు రంగు తప్పి ముడతలు పడ్డాయి. కేసరాలు ఒక్కొక్కటే వూడి జాలిగా కింద ఆకుల మీద వాలి గాలి వూపుకి దుమ్ములో పడ్డాయి. కాని దృష్టిని తన గర్భం వేపు తిప్పి, తననీ, తన అందాన్నీ, ప్రపంచాన్నే మరిచింది పువ్వు.

అతను బలహీనంగా, మృదువుగా కొమ్మల్లో దాక్కునే తన కోసం, ఇంకా రాడేం? వెళ్లి పోడు కదా?

మబ్బుల నుంచి చివరి రంగుల్ని పిలుచుకుని సూర్యుడు ఎప్పుడు కడసారి శెలవు చెట్ల చిటారి కొమ్మల మీద గరుడుల నుంచి తీసుకొని వెళ్లిపోయాడో, ఎప్పుడు శాంతి గీతాల్ని వాయు కుమారులు పాడి కొమ్మల్లో కూచున్నారో, ఒక్క క్షణం విశ్రాంతి లేక తిరిగిన జీవులన్నీ ఎక్కడెక్కడ అన్ని వ్యాపుర్తుల్నీ వొదిలి నీడలో వొదిగాయో, పక్షులూ, కోతులూ తన తలపై గుబుర్లలో ఎప్పుడు మాటు మణిగాయో గమనించనైనా లేదు పువ్వు.

వెతికి వెతికి మూల మూలలు దాక్కున్న వెలుతురిని మింగేస్తోంది వెయ్యి నాలికలతో చీకటి.

మొదటి నక్షత్రపు మిణుకు మిణుకు లోంచి జారిన కాంతిరేఖ మీద కూచుని వొచ్చి నిలిచాడు తన ముందు.

తనపేరు పిలిచాడు.

"ఎవరు" అంది పువ్వు. కాని తెలుసు తనకి,

గజగజ వొణికింది. చుట్టూ చూసింది ఏడుస్తో.

"రా!" అన్నాడు.

"నా పాపాయి" అంది.

"నీ ప్రాణాన్ని నీ పాపాయి కిచ్చి నాతో రా!" అన్నాడు నవ్వుతో

"ఎట్లా రానూ!" అని అరిచింది చివరి అరుపు.

తన చేతిని పట్టుకుని, కన్నీళ్లు తుడిచాడు.

"చూడు!" అన్నాడు.

లోకమంతా పెద్ద వెలుగు, అన్ని రూపాల్నీ, భిన్నత్వాల్నీ తనలో కరిగించుకుంటున్న మెత్తని వెలుగు. నేల మీద ఎండుటాకులనించి, ఆకాశాన నక్షత్రాల దాకా, అన్నిటినీ ఏకం చేసే దివ్యకాంతి, అంతా, అంతా, ఆ వెలుగంతా అతను. అన్ని చోట్లా అతను.

పొట్టలోని ఆకళ్లని నింపుతో, పట్టుకు చీల్చుకుతింటో, చీకట్లో దాక్కుంటో, పిల్లలకి రసం తాగిస్తో, చంపుతో, ఏడుస్తో, నవ్వుతో, కోపంతో దూకుతో, ఆనందంతో వూగుతో ప్రతి మూలా అతను, తన పాపాయిని లాలిస్తో, తాగిస్తో అతను.

"రా!"

నవ్వుతో తన వార్ధక్యం, నిరర్థకత్వం, ఎండుతనం అంతా పోయి, బాల్యం. యువ్వనం, బలం, సంతోషం, మాతృత్వం, ప్రేమ, అన్నీ అతని ముందు అర్పించి మొక్కింది.

అతని చెయ్యి పట్టుకుని అనంతాకాశంలోకి ఒక్క దూకు దూకింది.

ఇంక భయమనేది లేదు. విచారం లేదు, సందేహం లేదు. సమస్తమైన ప్రపంచంతో, కాలంతో అతి సన్నిహితుడతడు. అతని వేళ్లను పట్టుకున్న తన నింక ఏ మూల ఏ రూపంతో నిలిపినా ఆ కొత్త వుండదు. తనకోసం చేతులు జాచి వుంటాయి. చిరునవ్వులు వెలసి వుంటాయి. తన ఆగమనం కోసం గొప్ప విలువలు ఉంటాయి ఆకాశంలో తేలుతో, భక్తితో అతని మొహం వంక చూసి పక్కున నవ్వింది – ఆనందాన్ని అణుచుకోలేక!



మేటి కథలు-లోతు వ్యాఖ్యలు

# స్త్రీ జీవన యానానికి తాత్విక పరిమళాలద్దిన కథ- 'ఓ పువ్వు పూసింది'



డాక్టర్ కొత్వాలు అమరేంద్ర
✆ 91777 32414





ప్రశంసల్లో, ప్రబోధాల్లో మాత్రం ఆకాశంలో సగంగా కీర్తించబడే స్త్రీ జీవితంలోని విభిన్న అవస్థల్ని ప్రకృతితో సంలీనం చేసి సంచలన రచయిత గుడిపాటి వెంకటాచలం ఆమె జీవితాన్ని తాత్వికంగా ఆవిష్కరించిన అపురూపమైన, అరుదైన కథ 'ఓ పువ్వు పూసింది'. స్త్రీ హక్కుల కోసం, ఆమె స్వేచ్ఛ కోసం తాను సృష్టించిన సాహిత్యమంతా తపించిన చలం హృదయాలకు హత్తుకొనే ప్రకృతి సంబధిత ప్రతీకలతోనే ఈ కథను రూపొందించడం ఒక అద్భుత ప్రయోగమనే చెప్పవచ్చు. దీనిని కవితాత్మక కథానికగా కూడా అభివర్ణించవచ్చు.

సాహిత్యంలో స్త్రీవాదమే ప్రవేశించని రోజుల్లో స్త్రీ స్వేచ్ఛ కోసం విపరీతంగా తపించి స్త్రీ సమస్యల్ని వినూత్న కోణాల్లో పరిశీలించి తన రచనల్లో స్త్రీ అస్తిత్వానికి పెద్దపీట వేసిన చలం తెలుగు రాష్ట్రాలలోని అనేకమంది మహిళాపాఠకులకు ఆరాధ్య రచయిత. తాను నమ్మింది నిజజీవితంలో ఆచరించి దానిని తన రచనల్లో ప్రతిఫలింపజేసిన ఈయన ముఖ్యంగా తన విలక్షణ శైలీవిన్యాసంతో తెలుగు పాఠకలోకాన్ని ఉర్రూతలూగించారు. దాదాపు ఒక దశాబ్దకాలంపాటు ఆయన సాహిత్యం ఒక ఉప్పెనలా

విరుచుకుపడింది. చలం తన రచనల్లో పురుషస్వామ్య సమాజ దుష్ట లక్షణాలనూ, సనాతన సంప్రదాయాలనూ తూర్పారబట్టారు. వ్యక్తిస్వేచ్ఛకు ఎంతో ప్రాధాన్యతనిచ్చారు. పాతివ్రత్యం, దాంపత్యధర్మాలలోని అసలైన స్వభావాన్ని ఎత్తిచూపారు. ఆయన నిర్మొహమాటంగా వెలిబుచ్చిన అభిప్రాయాలు సాహితీలోకంలోని పలువురిని కలవరపరిచాయి కూడా.

1949లో వెలువడిన 'ఓ పువ్వు పూసింది' కథ స్త్రీ పురుషుల జీవన వైరుధ్యాలను అనేక ప్రకృతి వర్ణనల ద్వారా వెలికితీసింది. చీకటి వేళ ప్రారంభమయ్యే కథ చీకటివేళనే ముగుస్తుంది. రచయిత వర్ణనావైదుష్యమే కథనంతటినీ నడిపిస్తుంది. ఒక చిన్న ఉద్యానం కాన్వాసుగా, పూలచెట్టు ప్రధాన కేంద్రంగా, ముఖ్యంగా స్త్రీ జీవితంలోని ఆనందాలు, ఆవేదనలు, తపనలు, ఆలోచనలు, ప్రేమానుభూతులు, అర్పిత భావనలు... ఇలా విభిన్న దశల్నీ ప్రకృతి సౌందర్యాలతో సంలీనం చేస్తూ విశ్లేషించింది. తాత్విక నేపథ్యంలో ఎన్నెన్నో ఆలోచనల పరంపరనూ, జీవన రహస్యాలనూ వెల్లడిస్తూ కవిత్వంలా సాగే చలం 'మ్యూజింగ్స్' ప్రభావం ఈ కథ మీద ఎంతగానో వుంది. కథలోని పలు వర్ణనలు 'మ్యూజింగ్స్' ను తలపిస్తాయి. ప్రకృతిలో భాగాలైన తల్లితీగ, పువ్వు, తుమ్మెద... ఈ మూడు పాత్రల చుట్టే మానవ జీవితానికి ప్రతిబింబంలా సాగుతుందీ కథ. వీటిలో కథానాయకిగా భావించే పువ్వు మీదే కథకుడి ప్రధాన దృష్టి వుంటుంది. ప్రపంచంలో ప్రతి ఒక్కరూ ఆత్మీయంగా, అపురూపంగా భావించే పువ్వులో కథకుడు పరకాయప్రవేశం చేస్తాడు. చలం అత్యంత సుకుమారమైన పువ్వు ద్వారా స్త్రీ మనస్తత్వాన్ని విశ్లేషిస్తాడు. తన ఆనందం కోసం, స్వార్థం కోసం దాని మకరందాన్ని గ్రోలే తుమ్మెద ద్వారా పురుషాధిక్యతను ప్రకటిస్తాడు. ఈ రెండు ప్రతీకల ద్వారానే మానవ జీవిత సౌందర్యాన్నీ, ఆ సౌందర్యంలోని రహస్య మార్గాల్నీ అన్వేషిస్తాడు. మొగ్గదశనుంచి పరిమళాల్ని వెదజల్లుతూ

**1949లో వెలువడిన 'ఓ పువ్వు పూసింది' కథ స్త్రీ పురుషుల జీవన వైరుధ్యాలను అనేక ప్రకృతి వర్ణనల ద్వారా వెలికితీసింది.**

విరబూసిన పుష్పం తీయని మాటలతో తనను వశపరచుకొని తన మకరందాన్ని గ్రోలి తనను గర్భవతిని చేసి తనకు దూరమైపోయే తుమ్మెద అహంకారానికి చలించిపోయి చివరకు మృత్యువులో ఆనందాన్ని వెతుక్కోవడం వరకూ ఈ కథ ఒక స్త్రీమూర్తి జీవితాన్ని దృశ్యమానం చేసి అనేక ప్రశ్నలను లేవనెత్తుతుంది. స్త్రీ జీవితంలోని అతి ముఖ్యమైన భాగమైన ఆమె యవ్వన దశలోని ఆనందాన్నీ, అంతలోనే అది అంతులేని ఆవేదనగా మారిపోవడాన్నీ రచయిత ఒక్కరోజూ కాలంలో 'పువ్వుపూసి రాలిపోవడం' అనే ప్రకృతి ప్రక్రియతో మన కళ్లముందు నిలుపుతాడు. పఠితల హృదయాలను కలచివేస్తాడు.

> 'అర్ధరాత్రి అడవిలో పువ్వు పూసింది' అని ప్రారంభమయ్యే కథలో ఆ పువ్వు చుట్టూ చీకటిని చూసి భయపడడం,

'అర్ధరాత్రి అడవిలో పువ్వు పూసింది' అని ప్రారంభమయ్యే కథలో ఆ పువ్వు చుట్టూ చీకటిని చూసి భయపడడం, కౌమార దశలోని పువ్వు తల్లి తీగతో తనకు తలెత్తే పలు అనుమానాల్ని నివృత్తి చేసుకోవడం ఆడపిల్లగా జన్మించడంతోనే ఎదురయ్యే చేదు అనుభవాల్ని గుర్తుచేస్తుంది. స్త్రీ జీవితం చుట్టూ అలముకొనే అవాంఛిత సామాజిక వాతావరణాన్నీ సూచిస్తుంది. అంటే ఇక్కడ రచయిత కథాగమనంలో సామాజిక వాతావరణాన్ని ప్రకృతి వాతావరణంతో సంలీనం చేసుకుంటూ వెళతాడు. ఆ పువ్వు కౌమార దశలోనే తనకు 'ఉత్సవాలు, వాయిద్యాలు, అరుపులు సంతోషాల'తో కనిపించే అందమైన లోకాన్ని తనివితీరా ఆస్వాదిస్తుంది. 'ఒక్కసారి తన మొదళ్లల్లోంచి, నేలలోంచి చీల్చుకొని తనలోకి దిమ్మరించే అమృతంతో తాను' నిండిపోతూ నవయవ్వనంలోకి అడుగుపెడుతుంది. ఆమె నవయవ్వనాన్ని రచయిత ఇలా వర్ణిస్తాడు. 'అకస్మాత్తుగా తనను మంచులో చీలుస్తో, పైన దొర్లి సముద్రమౌతూ అలలమల్లే మూర్ఛలు తెప్పించే పరిమళం. తనని, తన తల్లిని, గాలిని ఆకాశాన్ని నింపే, పొర్లే అలలుగా, జ్వాలలుగా తనలోంచి పరిమళాలు'.. ఇక్కడ ఒక స్త్రీ సౌందర్యావస్థలోకి పరకాయప్రవేశం చేశాడు

రచయిత. అలలు, జ్వాలలు వంటి పదప్రయోగాలతో ఎంత లోతుగా ఆమె అనుభూతులను చలం తన పుక్కిట పట్టుకోగలిగాడో పైవర్ణన తెలియజేస్తుంది. ఇంకా యవ్వనదశలో ఆమె చేష్టల్ని రచయిత ఇలా వర్ణిస్తాడు... 'అల్లరిగా గంతులేసింది. చప్పట్లు కొట్టింది. కళ్లలోంచే కాంతులు విసిరింది. ఎవరు అటు వెళ్లినా ఆకుల వెనుక దాక్కొని తొంగి చూసి పకపక నవ్వింది. పరిమళాన్ని ఎక్కడా అంతం లేని భాగ్యం మల్లే విరజిమ్మింది ప్రపంచం మీద'. ఇక్కడ యవ్వన దశలో వున్న స్త్రీ తన అందాల్ని ప్రదర్శించాలనుకునే మనస్తత్వాన్ని వివరిస్తాడు. 'ఆకుల్లోంచి సగం తొంగిచూసి పరిమళాన్ని విసిరింది పువ్వు. వూపిరాడనీయక మొహానికి అడ్డుపడి, రెక్కల బలాన్ని లాగేసి ఆ పరిమళానికి తలతిరిగి ఆగాడు మధుపం.' అంటూ పురుషుడిని ఆకట్టుకొనే వైనాన్ని తెలియజేస్తాడు. పువ్వు తుమ్మెదను ఆటపట్టిస్తూనే తుమ్మెద కోసం తపిస్తుంది. ప్రేమలో వున్న స్త్రీ విచిత్ర మనస్తత్వం అదే. ఆ మనస్తత్వాన్ని చలం ఈ విధంగా విశ్లేషిస్తారు... 'వొస్తున్నాడని భయం, సంతోషం, తీరా రాడేమోనని దిగులు, వొస్తున్నాడని గర్వం, సిగ్గు, ఏమిటంత స్వాతంత్రం? ఏమిటి ఇంత ఆలస్యం? తను తప్ప ఇంకేం కనబడకుండలే. తన చుట్టూ ప్రాధేయపడాలి. తను మాత్రం అందక ఆకుల్లో తప్పించుకొని వేధించాలి...' ఇలాంటి విచిత్రమైన ప్రేమ భావనలతో ఓలలాడడం స్త్రీ జీవితంలో ఒకానొక అద్భుత ఘట్టం. ఆ ఘట్టంలో ఆమెలో కలిగే ఆలోచనల పరంపరను ఇక్కడ వివరించాడు రచయిత. ఎట్టకేలకు పువ్వు తుమ్మెదను తనవైపుకు ఆకర్షించుకుంటుంది. 'నీ కోసమే అనంతకాలంనుంచే వెతుకుతున్నాను. నా ఐశ్వర్యాన్ని నీ పాదాలముందు గుమ్మరిస్తాను.' అంటూ తుమ్మెద పువ్వును ప్రాధేయపడడాన్ని తన్న గొంతుకతో 'మధురమైన అబద్దాలు'గా రచయిత అభివర్ణిస్తాడు. తుమ్మెద తీయని మాటలతో పువ్వు తుమ్మెదకు దాసోహమైపోతుంది. 'రేకులు రంగులు తప్పి ముడుతలు పడ్డాయి' అన్న ఒక్క వాక్యంతో పువ్వూ, తుమ్మెదల జీవనమాధుర్యాన్నీ, పువ్వును చేరిన మధుపం దాని ప్రేమను గ్రోలిన తరువాత పువ్వులో కలిగిన శారీరక మార్పునూ, అనంతరం తుమ్మెద పువ్వు దరిదాపుల్లోకి కూడా రాకపోవడాన్నీ సూచిస్తాడు రచయిత. ఆలా ఒక స్త్రీ పురుషుడి ప్రేమకు దాసోహమై మరో ప్రాణికి ప్రాణం పోస్తుంది. ఆ తరువాత ఎప్పటికీ రాని అతనికై అహర్నిశలూ

నిరీక్షిస్తుంది. ఇక పువ్వు గర్భవతి అయ్యే మరుసటి దశను రచయిత అత్యంత దైన్యంగా వివరిస్తాడిలా... ‘కేసరాలు ఒక్కొక్కటే వూడి జాలిగా కింద ఆకులమీద వాలి గాలి వూపుకి దుమ్ములో పడ్డాయి. కానీ దృష్టిని తన గర్భం వైపు తిప్పి తననీ, తన అందాన్నీ,ప్రపంచాన్నే మరిచిన పువ్వు’.. ఇక్కడ కేసరాలు(పుప్పొడి) పదప్రయోగం ఒక్కొక్కటిగా రాలిపోయే పువ్వు ఆశల్ని సూచిస్తుంది. ‘వెతికి వెతికి మూలమూలలు దాక్కొన్న వెలుతురిని మింగేస్తుంది వెయ్యి నాలికలతో చీకటి’ అనే వాక్యప్రయోగం ఆసమయంలో చోటుచేసుకున్న స్త్రీ అంతులేని ఆవేదనను సూచిస్తుంది. వెలుగులు లాంటి స్త్రీమూర్తులను అణచివేసే చీకటి పురుషాహంకారానికి ప్రతీకగా కనిపిస్తుంది. ఆ పువ్వు మరో పువ్వుకు జన్మనిచ్చి రాలిపోవడంతో ఈ కథ ముగుస్తుంది. అయితే రచయిత స్త్రీని మృత్యువు వరించే ఘట్టాన్ని ప్రయోగాత్మకంగా వర్ణిస్తాడు. ఒక వెలుగులా వచ్చి మృత్యువు తనని దివ్యలోకాలకు పిలుచుకొని వెళ్లినట్టు పేర్కొంటాడు. ‘లోకమంతా పెద్ద వెలుగు. అన్ని రూపాల్నీ, భిన్నత్వాల్నీతనలో కరిగించుకుంటున్న మెత్తని వెలుగు. నేల మీద ఎండుటాకుల నుంచి ఆకాశాన నక్షత్రాల దాకా అన్నిటినీ ఏకం చేసే దివ్య కాంతి. అంతా, అంతా, ఆ వెలుగంతా అతను, అన్ని చోట్లా అతను’ ... అంటూ మృత్యువును వర్ణించడంలో చలం తాత్వికత పరాకాష్టనందుకుంది. అప్పుడు అతని చెయ్యి పట్టుకొని పువ్వు ఆనంతాకాశాన్ని చేరుకొని ఆనందంతో తన్మయురాలౌతుంది. అనంతాకాశం స్వేచ్ఛను సూచిస్తుంది. ఇక్కడ అంతటి దివ్యలోకం భూమి మీదా ఆవిర్భవించాలని, బాధలన్నీ తొలగించుకొని స్త్రీ భూమి మీది దివ్యలోకంలో ఆనందంగా విహరించాలని రచయిత ఆకాంక్షించాడు. ‘ఇక భయమనేది లేదు. విచారం లేదు. సందేహం లేదు. సమస్తమైన ప్రపంచంతో, కాలంతో అతి సన్నిహితుడతడు. అతని వేళ్లను పట్టుకున్న తననింక ఏ మూల ఏ రూపంతో నిలిపినా ఆ కొత్త వుండదు. తన కోసం చేతులు జాచి వుంటాయి. చిరునవ్వులు వెలిసివుంటాయి. తన ఆగమనం కోసం గొప్ప విలువలు వుంటాయి.’ అంటూ మృత్యువును వర్ణిస్తూనే రచయిత స్త్రీల జీవితాలను నందనోద్యానాలుగా మార్చే ఉత్తమ పురుషుల ఆగమనం కోసం అన్వేషిస్తాడు. ఇదే ఈ కథ పరమార్థం.’



# నన్నయ కాలం నాటి ప్రజల ఆహారం



డాక్టర్ జి. వి. పూర్ణచందు
✆ 94401 72642





నన్నయ భట్టారకుడు ఆంధ్రశబ్దచింతామణిలో "స్వస్థానం, స్వవేషం, స్వభాష వీటిపైన అభిమానం ఉన్న రసలబ్ధబుద్ధులైన సత్పురుషులు వైకృత కావ్యాలను వ్రాస్తారన్నాడు. అంటే సంస్కృతంలో కాకుండా తమ మాతృభాషలలో రచనలు చేస్తారని! రాష్ట్రాభిమానం, జాత్యభిమానం, దేశాభిమానం అనే భావాలు మనుషుల్లో ఉంటేనే జాతి మనుగడ సాగుతుందని ఆయన ప్రబోధం.

రేనాటి చోళుల్లాంటి సామంతరాజులు, పండురంగడి లాంటి సేనాపతులు, యుద్ధమల్లుడి లాంటి రాజులూ తమ నిర్ణయాల్ని, సాహసకృత్యాల్ని, భక్తి వితరణ భావాల్ని తెలుగులోనే చెప్పుకున్నారు. రాజరాజ నరేంద్రుడు తెలుగులో భారతాన్ని రాయవలసిందిగా నన్నయను కోరాడు. "తెనుంగు నిలిపి రంధ్రవిషయంబున, జనసత్యాశయుని దొట్టి చాళుక్య నృపుల్" అంటూ, చాళుక్యరాజులు ఆంధ్ర ప్రాంతంలో తెనుగుని నిలిపారని నన్నెచోడుడు ప్రస్తుతించాడు.

రాజరాజ నరేంద్రుడుకి తెలుగు భాషతోపాటు సనాతన మత గౌరవాన్ని,

వర్ణాశ్రమ ధర్మాలను తిరిగి నెలకొల్పాలనే కోరిక ఎక్కువ. నన్నయను తెలుగులో భారత రచనకు ప్రేరేపించి తద్వారా ఆ కోరిక తీర్చుకున్నాడు. వ్యాసభారతాన్ని ముక్కస్య ముక్క అర్థః అన్నట్టు అనువదించకుండా నన్నయగారు ఆంధ్రమహాభారతం అన్న పేరుతో స్వతంత్ర కావ్యంగా వ్రాయనారంభించాడు.

ప్రభుత్వ విధానాలే సంస్కృతిని ప్రేరేపిస్తాయి. బౌద్ధ, జైనాల నుండి వైదికమతం లోకి ఎక్కువమంది వచ్చి చేరుతున్న కాలం అది. వైదిక ఆచారాలకు ప్రాధాన్యత పెరిగింది. శాతవాహనుల గాథాసప్తశతి నాటికే ఈ పరిస్థితి కొంతవరకూ ఏర్పడినా నన్నయ కాలంలో అది నిలదొక్కుకుంది. శైవులు, వైష్ణవులతో పాటు బౌద్ధులు, జైనుల ప్రాబల్యం అక్కడ సమాజం మీద ఉంది. బోయలు, సవరలు కూడా బలంగా ఉన్నారప్పుడు. కులవ్యవస్థ మరింత బలంగా నాటుకుంది. కన్నడ సంస్కృతి కన్నా భిన్నమైన రీతిలో తూర్పుచాళుక్యులు తమ కాలపు సామాజిక వ్యవస్థని తీర్చిదిద్దారు. కన్నడ తెలుగు భాషల మధ్య ఎడం పెరిగిన కాలం అది!

ఆ కాలపు ప్రజలపైన ఆయుర్వేద శాస్త్ర ప్రభావం చాలా ఉంది. 10-11 శతాబ్దాలలోనే ధన్వంతరీ నిఘంటువు, నలుడి పాకదర్పణం లాంటి అనేక ఆయుర్వేద గ్రంథాలు వెలువడి దేశవ్యాప్తంగా ఆరోగ్య స్పృహని ప్రేరేపించాయి. సమకాలీన తెలుగు ప్రజలు వాటిని అందుకో గలిగారు. తెలుగు వారి ఆహారవిధానాలు ఆయుర్వేదపరంగా రూపొందేందుకు ఇదీ ఓ కారణమే.

> "తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి" అనే సామెతతో భారతానికి, భక్ష్యాలకు తెలుగువారు ముడిపెట్ట గలిగారు.

"తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి" అనే సామెతతో భారతానికి, భక్ష్యాలకు తెలుగువారు ముడిపెట్ట గలిగారు. అప్పటి ప్రజలకు వరి, గోధుమలతోపాటు జొన్నలు, రాగులు, సజ్జలు కూడా తెలుసు. 'చోళ' శబ్దానికి తమిళంలో జొన్నలని, తెలుగులో చోడి+లు=

చోళ్లు, రాగులు. లేదా తమిదెలనీ అర్థం. మౌలికంగా చాళుక్యులు రాజపుత్రులని, క్రమేణా ద్రావిడ జాతులపైన ఆధిపత్యం సంపాదించి, వారితో కలిసిపోయారని చెప్తారు. 'చులుకము' అంటే బ్రహ్మగారి దోసిలి (పుడిసిలి) అనే అర్థంలో ఈ చాళుక్య శబ్దం ఏర్పడిందని ఒక వివరణ ఉంది. రాజరాజ నరేంద్రుడి నుండీ తమిళ చోళచక్రవర్తులతో తూర్పుచాళుక్య రాజులకు సంబంధాలు బలపడి చాళుక్య చోళులుగా మారారు.

భూమ్మీద జీవించే జీవులకు ఆహారం అవసరం. దేవతలు ఏం తిని బతుకుతారో తెలీదు. వారికి ఆకలి దప్పులుండవని అంటారు గానీ, హవిస్సులలో వాటాలు వెడ్తున్నాయికాబట్టి వారికీ ఆహారం అవసరమే! అగ్నిదేవుడికి, గరుత్మంతుడనే పరివార దేవతకి వారివారి ఆహారాల్ని తీసుకునే వరాలున్నాయి. గజ కచ్ఛప భక్షణము అనే కథలో ఆస్తికోసం కొట్టుకున్న అన్నదమ్ములిద్దరూ ఒకరిని ఒకరు శపించుకుని ఏనుగు, తాబేలుగా మారతారు. అయినా కొట్టుకోవటం ఆపరు. "అవి నీ కాహారంబు సుమ్మరుగుము కార్యసిద్ధి యయ్యెడన్" అని, వాటిని తినే అధికారాన్ని గరుత్మంతుడికివ్వటం ఈ కథ సారాంశం. తండ్రి ఆస్తికోసం అన్నదమ్ములు కలహిస్తే ఆ ఇద్దరినీ మూడో వాడొచ్చి తన్నుకుపోతాడనే నీతి ఈ కథలో కనిపిస్తుంది. 'గరుత్మంతుడికి పాములు సహా జంతుమాంస భక్షణను అధికారికంగా ఇచ్చినట్టు 'సర్పాశనం' కథ చెప్తోంది. ఎలికల్ని, పాముల్ని గద్దలు తినటం సహజం. మరి, జంతువుల మాంసభక్షణం మానవులకూ అంతే సహజమా? ఈ ప్రశ్నకు నన్నయగారు పరోక్షంగా "నిషాద భక్షణావసరమున బాహ్మణులను పరిహరింపుము" అని సమాధానం ఇస్తాడు. జంతువుల్ని వేటాడి తినే నిషాదుల్ని కూడా తినే అధికారాన్ని గరుడుడికి ఇస్తూ, ఇందులోంచి బ్రాహ్మణులను పరిహరించమన్నాడు. ఎందుకంటే, వారు మాంసం తినరు కాబట్టి!

భూమ్మీద జీవించే జీవులకు ఆహారం అవసరం. దేవతలు ఏం తిని బతుకుతారో తెలీదు. వారికి ఆకలి దప్పులుండవని అంటారు

తెలుగువారిలో సంఖ్యరీత్యా మాంసాహారులే ఎక్కువైనప్పటికీ, వీరు శుద్ధమాంసాహారులు కారు. రోజువారీగా శాకాహారాన్నీ, అప్పుడప్పుడూ మాంసాహారాన్ని తింటూ ఉంటారు. అందుకని ప్రాచీన కావ్యాలన్నింటిలో శాకాహార వర్ణనలే ఎక్కువ కనిపిస్తాయి.

> **కామధేనువు సాయంతో వశిష్ఠుడు విశ్వామిత్రుడికి, అతని పరివారానికి అతిథి మర్యాదలు చేసిన సందర్భంలో నన్నయ చేసిన ఈ వర్ణన చూడండి**

కామధేనువు సాయంతో వశిష్ఠుడు విశ్వామిత్రుడికి, అతని పరివారానికి అతిథి మర్యాదలు చేసిన సందర్భంలో నన్నయ చేసిన ఈ వర్ణన చూడండి: గ్రామీణాహారం (పులుసు,మసాలాలు, నూనెలు పోసి వండిన వంటకాలతోకూడిన నాగరిక ఆహారం), ఆటవిక ఆహారం (ఫలాలు, కందమూలాలతో కూడిన ఆహారం), తీపి, పులుపు, ఉప్పు, కారం, వగరు చేదు రుచులతో కూడిన భోజనం, మధుర రసాయన పానీయాలు, పాలు, అమృత సమానమైన లేహ్యాలు (పచ్చళ్లు), గారెలు బూరెలు, అప్పాల్లాంటి భక్ష్యాలు, పీలుస్తూ తినే పులుసులు, పాయసాది పేయాలు, చెరకురసం, రత్నవస్త్రాదులు మొదలైన సమస్త మనోవాంఛితాలన్నీ ఆ కామధేనువు ద్వారా పొంది వశిష్టుడు వడ్డించాడట. ఆనాటి ఆహారం ఈనాటి మన ఆహారానికి నకలుగానే ఉంది! అయితే ఆయుర్వేదానుసారం జీవించారు కాబట్టి ఆ ప్రజలకు గ్రామ్యాహారం అజీర్తికరం అని తెలుసు!

ఆదిపర్వం బకాసురవధ ఘట్టంలో కొన్ని ఆహార పదార్థాలున్నాయి. ఏకచక్రపురవాసులు ప్రతిరోజూ ఒక ఎద్దు మోయగల మంచి బియ్యపు అన్నం, 20 తూముల ధాన్యం, 2 దున్నపోతులు, పంచభక్ష్యాలతోకూడిన వంటకాల్నీ, వాటిని తీసుకెళ్లే ఒక మనిషినీ ఆహారంగా పంపాలనేది నియమం. బండి నిండా వాటిని నింపాక, మొదట భీముడికి కడుపునిండా అన్నం పెట్టారు. భీమసేనుడు ఇష్టాన్న భోజనం చేసి, సంతృప్తి చెందినట్టు చేసిన వర్ణన ఇది.

"పలుదెఱంగుల పిండివంటలుఁ బప్పుకూడును "నేతికుం

డలు గుడంబు దధిప్రపూర్ణఘటంబులుం గొనివచ్చి యా

నలఘుసత్త్వుడు మారుతాత్మజుఁ డన్నిటన్ గత ఖేదుఁడై

బలము గల్గి కడంగె నప్పుడు బ్రాహ్మణార్థము సేయఁగాన్"

రకరకాల పిండివంటలు, పప్పన్నం, కుండెడు నెయ్యి, బెల్లం, కుండల్నిండా పెరుగుతో భీముడు ఈ యిష్టాన్న భోజనం చేసి సంతృప్తి చెందాడు. బ్రాహ్మణుడికి బదులు బకుడికి ఆహారంగా భీమసేనుడు వెడుతున్నాడు కాబట్టి ఈ భోజనాన్ని "బ్రాహ్మణార్థం" అంటాడు నన్నయగారు! భీముడు బండి తోలుకుంటూ బకాసురుడు ఉండే చోటుకు వెళ్లాడు. యమునా తీరాన బండి నిలిపి, అతన్ని పిలిచాడు. వాడు ఎంతకూ రాలేదు. అందాకా ఊరికే ఉండటం ఎందుకని, ఆ బండిలో ఆహార పదార్థాలన్నీ తనే ఒక్కొక్కటిగా తినేస్తాడు.

రకరకాల పిండివంటలు, పప్పన్నం, కుండెడు నెయ్యి, బెల్లం, కుండల్నిండా పెరుగుతో భీముడు ఈ యిష్టాన్న భోజనం చేసి సంతృప్తి చెందాడు.

సభాపర్వంలో ద్రౌపది లావణ్యాన్ని చూసి కౌరవుల భార్యలు ఈర్ష్య చెందారని నన్నయగారు ఇలా వర్ణిస్తాడు. "అఖిల లావణ్య

పుంజంబు నబ్జభవుఁడు/ మెలఁతగా దీనియందు నిర్మించె నొక్కొ/ కాని నాఁడిట్టి కాంతి యేకాంతలందు/ నేల లేదని సామర్షహృదయ లైరి" అని. ఇక్కడ లావణ్యం అనే పదానికి విస్తృతార్థమే ఉంది. లావణ్యం అంటే 'ముక్తాఫలచ్ఛాయావదంగదృశ్యమాన కాంతి" అంటే ముత్యంలాగా మెరిసే చర్మసౌందర్యం అని నిఘంటువులు అర్థాన్నిచ్చాయి. కానీ, 'లవణము యొక్క భావము లావణ్యము' అని దాని అన్వయార్థం. సైంధవ లవణం అనేది ఉప్పుగా ఉండే తెల్లని కొండరాయి. పెద్ద ఉప్పురాయిని పగల కొట్టినప్పుడు అది పలకలుగా పగిలి, దాని స్నిగ్ధత్వం చేత సూర్యకాంతికి తళతళా మెరుస్తుంది. ఆ మెరుపుని 'లావణ్యం' అంటారు.

ఆహారం జీవనాధారం కాబట్టి ఆహార ప్రస్తావన లేకుండా సాహిత్యం

ఉండదు. అయితే, మనిషి మానవుడిగా ఎదగటానికి కావలసిన రాజకీయ సామాజిక నియమాలకు ప్రాధాన్యత నివ్వటంతో నన్నయగారి ఆంధ్రమహాభారతంలో ఆహారపదార్థాల ఏకరువు తక్కువగా కనిపించినప్పటికీ, వాటిని ప్రస్తావించకుండా ఆగలేకపోయాడు నన్నయ. ఆ ఆహారంలో తెలుగుదనం రసాలూరుతుంటుంది.

*గమనిక : 23-07-2022 రాజమహేంద్రవరంలో "ఆంధ్రమహాభారత అవతరణ సహస్రాబ్ది, నన్నయ భారత సహస్రాబ్ది మహోత్సవాల సందర్భంగా చేసిన ప్రసంగ పాఠం.*



# ప్రథమా విభక్తి



శ్రీ మూని వెంకటా చలపతి
✆ 73966 08221



వాడు అంతే!
నాలుగు అక్షరాలు తెచ్చి
ఓ కవిత అల్లి
ప్రజల మనసును దోచుకెళ్తాడు!

వేప చేదుని
నాలుకపై పూసి సత్యాన్ని ఉమ్మద్దు
చప్పరించి మింగమంటాడు!

కోయిల స్వరాన్ని
కాకి కూతను శ్రద్ధగా ఆలకించి
సమాజంలోని ఎత్తుపల్లాలను
కలంతో చదును చేస్తానంటాడు!

ఎగిరే రెక్కకు దున్నే నాగలికి
అనుబంధం రుణానుబంధమేనని
పారే కాలువలో నీరు తాగి
రేగడినేలలో గొంతు ఎండేలా అరుస్తాడు!

కొన్ని గింజలను
పక్కవాడి సంచి సొరుగులో దాచాలని
సూర్యుని కిరణాలకు శ్రమజీవుల చెమటకు
దండం పెట్టి ఆ దారిలో నడవాలంటాడు!

ఆకలికి అన్నంతో పాటు
నాలుగు పుస్తకాలు నంజుకుతిని
పక్కవాడు నవ్వినప్పుడే పండగ అంటాడు!

వాడు అంతే!
కాలాన్ని సిరా చుక్కలో ముంచి
నిన్నటికి రేపటికి మధ్య సంధి కాలంలో
తన జ్ఞాపకాన్ని ఒక్క సంతకంతో ముగిస్తాడు!

పరిశోధనా వ్యాసం

# కార్గిల్ కథలు:దేశభక్తి



ఆచార్య.దేవారెడ్డి విజయలక్ష్మి
9949058611



## ప్రస్తావన:

సమాజం సంఘర్షణాత్మకమైంది. అనేక సంఘర్షణల మధ్య మానవుని జీవితం నలుగుడుపడుతూ సాగుతుంటుంది. ఏ వొక్కరూ స్థిమితంగా జీవిస్తున్నామన్న సంతృప్తి మానవ సమాజంలో కనపడటం లేదు. అనునిత్యం ఆరాటపోరాటాల సంఘర్షణలో జీవించడం అలవాటయింది. ఈ సంఘర్షణల నుండి బయటపడటానికై మానవుడు చేస్తున్న ప్రయత్నాలు అన్నీఇన్నీ కావు. ఈ పరుగుల ప్రయత్నాలలో ఎన్నో సంఘటనలను ఎదుర్కోవలసి వస్తుంది. ఆ సంఘటనలు వైయక్తిక సంబంధాలుగానూ, సామూహిక సంబంధాలుగానూ, రాష్ట్ర సంబంధాలుగానూ, దేశ సంబంధాలుగానూ, ప్రపంచ సంబంధాలుగానూ ఉంటున్నాయి. ఈ సంఘటనలు వైయక్తికంగా కాకుండా సమాజగతంగా జరిగినపుడు మానవస్పందన అనేకకోణాలలో వెలువడుతుంటుంది. కథకులు, రచయితలు, కవులు వీటిపై స్పందిస్తూ రచనలు చేస్తుంటారు. అటువంటి సాహిత్యాన్ని సంఘటనాత్మక సాహిత్యం అంటారు. అంటే మనం నివసిస్తున్న



ప్రదేశంలో గానీ, మన రాష్ట్రంలోగానీ, దేశంలోగానీ, ప్రపంచవ్యాప్తంగా గానీ ఏదైనా ఒక సంచలనాత్మక సంఘటన జరిగినపుడు ఆ సంఘటనను ఉద్దేశించి సాహిత్యం అల్లుకుంటే ఆ సంఘటన సమాజాన్ని కుదిపేస్తే, దానివల్ల జరగరాని తీరని నష్టం వాటిల్లితే, ఆ దురదృష్టపు చర్యవల్ల ప్రాణనష్టం, మాననష్టం వాటిల్లినపుడు సమాజం అతలాకుతలమై తల్లడిల్లినపుడు ఆ దుర్ఘటన సృజనరూపంలో వెలుగొందినపుడు కొంతకాలం అది ప్రజలమధ్య తారాడుతుంది. మరికొంత కాలానికి దాని ప్రభ తగ్గుతుంటుంది. కానీ దానిని చదివినపుడల్లా ఆ సంఘటన మనసును అతలాకుతలం చేస్తూ నాటి క్షోభను మననంలోకి తెస్తుంటుంది. ఉదా. కారంచేడు సంఘటన, అమెరికాలో ట్విన్ టవర్స్ పై జరిగిన ముష్కర దాడి, నిర్భయ అత్యాచారం, ముంబయ్ కాల్పులు, కార్గిల్ యుద్ధంఇలా ఎన్నో సంఘటనలు. సామాజికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా ఏర్పడిన అస్తవ్యస్త స్థితిని చిత్రీకరించి సృజన చేశారు. వీటినే సంఘటనాత్మక సాహిత్యం అంటారు.అటువంటిదే కార్గిల్ కథల సంపుటి.

> ప్రజాస్వామ్య భారతదేశంలో సహజమైన దేశభక్తి అంటే ఎప్పటికప్పుడు ప్రజలూ పాలకులూ తమ పనులను ఆలోచనలనూ విధానాలనూ సమీక్షించుకుంటూ..

ప్రజాస్వామ్య భారతదేశంలో సహజమైన దేశభక్తి అంటే ఎప్పటికప్పుడు ప్రజలూ పాలకులూ తమ పనులను ఆలోచనలనూ విధానాలనూ సమీక్షించుకుంటూ అవి వైయక్తిక అభివృద్ధికి దోహదపడుతూ దేశ అభివృద్ధిలో భాగస్వామ్యం అవుతున్నాయా లేదా అని బేరీజువేసుకుంటూ ముందుకు పోవడం. ఇందుకు భిన్నంగా మనిషి తన స్వార్థానికి తన్ను తాను మోసం చేసుకుంటూ కులం మతం ప్రాంతం ధనాపేక్ష పేరిట అకృత్యాలు చేస్తూ, దేశాన్ని దుయ్యబట్టడం, దేశద్రోహపు పనులలో భాగస్వామ్యం వహించడం, మోసపూరిత దృక్పథంతో ధనార్జనచేయడం, ప్రజాస్వామ్యానికి తూట్లుపోడిచే దుష్టరాజకీయ చేష్టలు చేయడం, దేశ ఆర్థిక వనరులకి

తూట్లుపోడవడం వంటి అంశాలలో దేశభక్తి కానరాదు.ఇవి రెండూ ప్రకృతి వికృతి రూపాలు. మరోపక్క చూస్తే సాధించుకున్న స్వరాజ్యాన్నీ కాపాడుకోవడంలో ఎందరో సైనికులు అనునిత్యం చలి, ఎండ, వాన, కొండ, లోయ, అడవి, సముద్రం, నీళ్లు, నిప్పు, గాలి, తుపాను అనకుండా దేశరక్షణకై పాటుపడుతున్నారు. వీళ్లు భూభాగంపైన, సముద్రంలోనూ, గగనమార్గంలోనూ రక్షణ పనులలో నిమగ్నులై ఉంటారు. వారికి ప్రాణం తమ శ్వాస కాదు.దేశ రక్షణే వారి శ్వాస, ప్రాణం. చాలామంది దేశరక్షణార్థం తమ ప్రాణాల్ని బలిత్యాగం చేస్తుండడం మనం వార్తల్లో చదువుతూ వింటూ చూస్తూ ఉంటున్నాం.సైన్యమంటే ఉద్యోగంకాదు. సైనికులు ఉద్యోగస్తులు కారు. ఆబాల గోపాలమూ నమస్కరించ మనస్కరించు వారే సైనికులు.

స్వాతంత్ర్యానంతరం భారతభూమిపై కయ్యానికి కాలుదువ్వుతున్న పాకిస్థాన్, చైనా దేశాలు పైకి స్నేహ హస్తాన్ని చాచుతూ చాప కింద మంటలు పెట్టే తీరు మనకి కొత్తేమీ కాదు. స్వాతంత్ర్యం వచ్చింది మొదలు మనకి అనేక సందర్భాలలో ఈ చేదుని అందిస్తూనే ఉన్నాయి. పొంచి ఉన్న దొంగల్లాగా దొంగదెబ్బ తీస్తూనేఉండటం ఆ రెండుదేశాలకు అలవాటయింది. ఎప్పటికప్పుడు అప్రమత్తంగా ఉండవలసిన స్థితి భారత సైన్యానిది. ఈ క్రమంలోనే పాకిస్తానీయులు 1947-48లో జరిపిన కాశ్మీర్ ముట్టడి, 1965లో జరిపిన రెండవ దండయాత్ర, 1971లో పాకిస్తాన్ జరిపిన మూడవ ముట్టడి, 1999లో జరిపిన కార్గిల్ దండయాత్రలలో భారత త్రిదళ సైనికుల వీరోచితపోరాటంద్వారా ప్రపంచదేశాలకు భారతస్థైర్యాన్ని చాటిచూపించారు. పై యుద్ధాలలో సైనికులు 17,000 మంది వీరమరణం పొందారు, 30,000 మంది క్షతగాత్రులైనారు.

> స్వాతంత్ర్యానంతరం భారతభూమిపై కయ్యానికి కాలుదువ్వుతున్న పాకిస్థాన్, చైనా దేశాలు పైకి స్నేహ హస్తాన్ని చాచుతూ చాప కింద మంటలు పెట్టే తీరు మనకి కొత్తేమీ కాదు.



భారతసైనికులు ప్రాణాలను పణంగా పెట్టి శత్రుదేశాల చాటుమాటు చొరబాట్లను ఎదుర్కొని, శత్రువులతో పోరాడటం, శత్రువులను మట్టుబెట్టడం, లేదా తరిమికొట్టడం బాధ్యతగా భావించారు. ఈ వీరోచిత పోరాటంలో ప్రాణాలను ఫణంగా పెట్టి దేశ రక్షణే ధ్యేయంగా పోరాడి భరతమాత కీర్తిని హిమగిరిశిఖరాన నిల్పిన సైనికులు ఎందరెందరో. పాకిస్థానీయ జవాన్లకు చుక్కలుచూపి భారత సైనికులు తమ సత్తాను నిరూపించారు. ఎన్ని సార్లు నడ్డివిరిచినా పాకిస్థాన్ బుడ్డ బెదిరింపులతో అపుడపుడూ తోక జాడిస్తూనే ఉంది. అయినా వెన్ను చూపేదిలేదని ప్రపంచానికి భారత్ సైనికులు చాటిచెప్తున్నారు.

ఆధునిక సాహిత్యం ఆవిర్భావం నాటికే దేశంలో బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేకతతో స్వాతంత్ర్య సమర పోరాటం ముమ్మరంగా సాగుతుండింది. మనదేశంలోని కవులు రచయితలు నాటినుండి నేటివరకూ ఏ సందర్భంలోనయినా దేశంలో జరిగే విద్రోహక చర్యలను ఎండగడుతూ, విదేశీ చొరబాట్లను, యుద్ధాలను వ్యతిరేకిస్తూ సైనికుల పక్షంవహించి వారివీరోచిత చర్యల్ని, ఎదుర్కొను విపత్కర సంఘటనల్ని, వీరమరణాన్నీ, యుద్ధస్థావరాల్లోనూ క్షేత్రంలోనూ వీరి జీవనశైలిని చిత్రీకరిస్తూ, దేశభక్తినిపెంపొందించే రచనలతో సైనికులకు మద్ధతుగా ప్రజలను అప్రమత్తం చేస్తూ ఇబ్బడిముబ్బడిగా సాహిత్యం వెలువరించారు. ఇటువంటి సాహిత్యంఅన్ని భాషల్లోనూ అన్ని ప్రక్రియల్లోనూ దేశభక్తి సాహిత్యం పేరుతో పుష్కలంగా దొరుకుతుంది. వెతుక్కుంటూ పోతుంటే ఇసుకపాతరలాగా వస్తూనేవుంది.

అటువంటి అనేకంలో ఒకటి కార్గిల్ కథలు సంపుటి. కార్గిల్ యుద్ధంపై చిత్రీకరించిన దృశ్యమాలికలతో అందించారు.దీనిని కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ రచించారు. సాహితీ వాచస్పతి బిరుదుపొందిన శ్రీ కాటూరి రవీంద్ర త్రివిక్రమ్ కృష్ణాజిల్లా వాసి. 16సం.రాలు భారత వైమానికదళంలో

పనిచేశారు. యుద్ధాలలో పాల్గొన్నారు. కొన్ని వందల కథలు రాశారు. రచయితకు యుద్ధరంగంతోనూ సైనికదళంతోనూ ఉన్న స్వీయానుభవం వాస్తవిక దృక్పథంతో సృజనచేయడానికి సహకరించింది. ఈ పోరాటం జరిగిన తీరును, ప్రాంతాన్నీ, అందులో మరణించిన గాయపడిన సైనికుల వీరోచిత పోరాటాన్నీ చిత్రీకరిస్తూ కార్గిల్ కథలనే పేరుతో సంపుటంగా వెలువరించారు. దీనిని చినుకు పబ్లికేషన్స్, విజయవాడ వారు ప్రచురించారు. ఇందులో మొత్తం 29 కథలున్నాయి. ఇందులోని ప్రతి కథ కార్గిల్ యుద్ధంలో జరిగిన సైనికచర్య చిత్రీకరణకు ప్రతీక.ఇవి కేవలం సృజనకథలు కావు. కార్గిల్ కథలు సంపుటిలోని సంఘటనలన్నీ మనకు దృశ్యమాలికలుగా కనిపిస్తుంటాయి. వీటిని కథలు అనడంకంటే చిత్రమాలికలు అంటే బాగుంటుంది. చాలా వరకు ఇందులో కార్గిల్ యుద్ధ సమయంలోని నిజస్థితిని చిత్రీకరించిన కథలే ఉన్నాయి.

ఈ కథలలోని వస్తువు యుద్ధవీరులనుండి, వారి సహచరులనుండి సేకరించిన సమాచారం ఆధారంగా వెలువడినవి. ఎక్కువ భాగం కార్గిల్ యుద్ధ భూమిలోని విశేషాలు రచితమై ఉన్నాయి. అక్కడక్కడా రచయిత సృజన ఉంది. అయితే సృజన చేసిన విధంకూడా సజీవ దర్శనంగా చిత్రీకరించడం చూస్తే సైనిక కుటుంబాలతోనూ సైనికరంగంతోనూ యుద్ధభూమితోనూ రచయితకున్న పరిచయందగ్గరి సంబంధమని స్పష్టంగా తెలుస్తుంది.

నిశ్శబ్ద యుద్ధతంత్రంతో చాపకిందపాములా దూరి అదనుచూసి భారత్ ను కాటువేయడనికి పాకిస్థాన్ వేసిన దురాగతమైన పన్నాగం కార్గిల్ యుద్ధం.కార్గిల్ యుద్ధం 1999లో జరిగింది. జమ్మూ కాశ్మీర్ రాష్ట్రంలో కార్గిల్ ఒక జిల్లా. ఇది హిమాలయ పర్వతాలలోని లోయప్రాంతం. కార్గిల్ ప్రాంతంలోని పర్వత శ్రేణులుపాకిస్థాన్ వైపు ఏటవాలుగానూ భారత్ వైపు నిటారుగానూ ఉంటాయి.



ఈ ప్రాంతం సముద్రమట్టానికి 18,000 అడుగుల ఎత్తులో ఉంది. వేసవి కాలంలోనూ ఎముకలుకొరికే చలి గజగజలాడిస్తుంటుంది. ఈ ప్రాంతంలోని వాతావరణాన్ని తట్టుకోవడమంటే ప్రాణాలకు ముప్పు కొనితెచ్చుకున్నట్లు. అలాంటి దారీతెన్ను తెలియనిపర్వత సానువుల్లో చీకటిమాటున శత్రువుల చొరబాటు.

ఇటువంటి తరుణంలో తాషీనామ్ గ్యాల్ అనే స్థానికుడు పశువుల్ని కార్గిల్ కొండలమీద మేపుకు తీసుకుపోతుంటాడు.

ఇటువంటి తరుణంలో తాషీనామ్ గ్యాల్ అనే స్థానికుడు పశువుల్ని కార్గిల్ కొండలమీద మేపుకు తీసుకుపోతుంటాడు. బైనాక్యులర్ తో చూస్తూ దూరంగా వెళ్లిన పశువుల్ని మందలోకి తోలుకొచ్చి మలేస్తూ ఉంటాడు. మందలోని ఎద్దు కనపడక పోవడంతో బైనాక్యులర్ సాయంతో ఎద్దును వెతుక్కుంటూ శిఖరంపైకి వెళుతుంటే ఆరుగురు పాకిస్తానీ సైనికులు పహరా కాస్తూ కన్పించారు. వెంటనే అతను ఆలస్యం చేయకుండా అతనికి సమీపంలో ఉన్న ఆర్మీపోస్టుకు పరిగెత్తుకెళ్లి తానుచూసిన విషయం చెప్పాడు. అతను చెప్పిన విషయాన్ని నిజనిర్ధారణ చేసుకుని తాషీనామ్ గ్యాల్ ని అభినందన పూర్వకంగా ఆలింగనం చేసుకుని 50,000 నగదు బహుమానం ప్రకటించారు. నాటినుండి నేటివరకూ భారత సైన్యం తాషీనామ్ గ్యాల్ ని యూనిఫామ్ వేసుకోని సిపాయిగా గౌరవిస్తూనేవుంది.

ఇరు దేశాల ఒప్పందాలకు విరుద్ధంగా సరిహద్దుల్ని దాటి మదేశంలోకి చొరబడింది. వాస్తవాధీన రేఖనుండి భారతదేశంవైపు కార్గిల్ కు ఉత్తరంగా 80 కిలోమీటర్ల పొడవున దట్టమైన మంచుకొండలపై 16 వేల నుంచి 18 వేల అడుగుల ఎత్తున ఉన్న కార్గిల్ కొండల్లోకి పాకిస్థాన్ దేశం శత్రువుల ప్రోత్సాహంతో వందలాదిమంది సాయుధచొరబాటుదార్లను పంపింది. వీళ్లు మంచుదిన్నెలమాటున కీలకప్రాంతాలల్లో పటిష్టమైన స్థావరాలను

ఏర్పరచుకున్నారు. బంకర్లు తవ్వుకుని వాటిని ఇనుపచట్రాలతో కోటల్లా నిర్మించుకున్నారు. శక్తివంతమైన శతఘ్నులు, మెషిన్ గన్లు చేరవేసుకున్నారు. కావలసినంత మందుగుండుసామగ్రిని ఆయుధాలను ముందస్తుగా భద్రపరచుకున్నారు. ఆరు నెలలపాటు ఉండటానికి కావలసిన ఆహారపదార్థాలను అందుబాటులో ఉంచుకున్నారు. అదనుచూసి శ్రీనగర్ – లే రహదారిపై వస్తున్న భారత సైనిక వాహనాలను పేల్చివేయడం, కాశ్మీర్ ప్రాంతంలో కల్లోలాలు సృష్టించడం, భారత ఆయుధాగారాల్ని గుర్తించి పేల్చివేయడం వంటి దుశ్చర్యలకు ఆలవాలంగా ముందస్తు బందోబస్తు చేసుకున్నారు. ఈ దుశ్చర్యభారత్ కుపెనుసవాలుగా మారి కార్గిల్ యుద్ధంగా రూపొందింది.

ఇక కథా గమనరీతిని చూస్తే కథలలోని విషయమంతా కార్గిల్ జిల్లాలోని పర్వతశ్రేణులైన టైగర్ హిల్, టోలోలింగ్, యాల్దోర్ (పొజిషన్ 5302అంటారు)(ఈ కొండ 18,000 అడుగుల ఎత్తు), కార్గిల్, బటాలిక్ సెక్టర్, ద్రాస్ సెక్టర్, రాకీనాబ్, దిహరిప్ సానువుల్లో జరిగిన యుద్ధ విజృంభన సంఘటనలు. సైనికుల గమనం, సైనికుల మరణం, సైనికుల క్షతగాత్రత, వీరోచిత పోరాటంలో పొందిన విజయ విహారం. మరో కోణంలో సైనికుల కుటుంబం, కుటుంబీకుల ఎదురుచూపు, కుటుంబసభ్యుల స్థైర్యం, మనోనిబ్బరం, దేశభక్తి, పిల్లల్లో సైనికులు కావాలనే ఉత్సుకత. పై రెండు కోణాలలోనూ రచయిత సమతూకాన్ని పాటిస్తూ దేశరక్షణకి కుటుంబానికీ గల అవినాభావ సంబంధాన్ని తెలియజేశారు.

యుద్ధం అంటే ఇద్దరి వ్యక్తులకు సంబంధించిన గొడవకాదు. రెండు దేశాల రక్త తర్పణం, రెండు దేశాల మరణమృదంగం. యుద్ధంవల్ల యావత్ దేశప్రజలు మరో దేశంలోని ప్రజలతో కోల్పోతున్న సఖ్యత, రెండు దేశాల ప్రజలమధ్య విచ్ఛిన్నమైపోతున్న సౌభాతృత్వం, రెండు దేశాలమధ్య ఏర్పడనున్న ఆర్థికమాంద్యం,

> యుద్ధం అంటే ఇద్దరి వ్యక్తులకు సంబంధించిన గొడవకాదు. రెండు దేశాల రక్త తర్పణం, రెండు దేశాల మరణమృదంగం

రెండుదేశాల శాస్త్రసాంకేతిక ప్రగతినిరోధం, ఒకదేశం మరోదేశంపై పెంచుకున్న విశ్వాసాన్ని నమ్మకాన్ని భూస్థాపితం చేయడం. పాకిస్థాన్ ప్రత్యేక దేశంగా ప్రకటించుకున్న కాలంనుండి భారత భూభాగంపై శత్రుత్వంపెంచుకుంటూ కయ్యానికి కాలుదువ్వుతూనే రెచ్చగొడుతుంది.

భారత భూభాగంలో కార్గిల్ జిల్లా పేరు 1999కి ముందు ఆ ప్రాంతం వాళ్లకి తప్ప తక్కిన వారికి తెలియదు

భారత భూభాగంలో కార్గిల్ జిల్లా పేరు 1999కి ముందు ఆ ప్రాంతం వాళ్లకి తప్ప తక్కిన వారికి తెలియదు. హిమవత్పర్వత సానువుల్లో ఈ ప్రాంతం పాకిస్థాన్ కు చేరువలో ఉంది. ఈ జిల్లాలోని ప్రదేశాలన్నీ రక్తాన్ని గడ్డకట్టించేంత మంచు ఉన్న పర్వత శిఖర ప్రాంతాలు. ప్రాణాంతకమైన చలిగాలులు వీచే ప్రదేశం. మనుష్య సంచారానికి అనువైన ప్రదేశం కాదు.ఆ ప్రాంతంలోనే పుట్టి పెరిగిన కొందరికి మాత్రమే అక్కడి వాతావరణం అనుకూలం. భారత భూబాగంలోని ఇక్కడి పర్వత శ్రేణులన్నీ నిటారుగా ఉంటాయి. అధిరోహించడం చాలా కష్టం.

### ప్రత్యేక శిక్షణ ఆవశ్యకత:

ఇలాంటి చోట్ల యుద్ధానికి వెళ్లాలంటే సైనికుడికి ప్రత్యేక శిక్షణ అవసరం. ఈ ప్రదేశాలలో శిక్షణ పొందేటపుడు ప్రతి సైనికుడూ తనతో తీసుకు వెళ్లవలసిన కనీస సామగ్రి 24 కిలోల బరువుంటుంది. అందులో ఉక్కుశిరస్త్రాణం(1.2 కిలోలు), ఇన్సాస్(ఎస్.ఎల్.ఏ)రైఫిల్(4.5కిలోలు) ఆపద్ధర్మ ఆహారంగా బెల్లం ముక్కలు, పిండి, చాక్లెట్లు వగైరా(సుమారుగా 2 కిలోలు) కనీసం 100 తూటాలు(3.2 కిలోలు) పడక(2కిలోలు) నీటి బుడ్డీ (1.4కిలోలు) ప్రత్యేక పరికరాలు, (ఉలి కొక్కేలు, తాడు వగైరా(1½ కిలోలు)పర్వత ప్రాంత దుస్తులుగా క్రిందిజాకెట్, ట్రవుజర్లు, థర్మల్ వెస్ట్‌లు, టోపీ, కళ్లద్దాలు, మంచులో వాడే బూట్లు (7½ కిలోలు)ఉంటాయి. ఇవన్నీ తను వెళ్లినంత దూరం మోసుకుంటూనే వెళ్లాల్సిన పరిస్థితిని కళ్లకు కట్టినట్లు చిత్రీకరించారు (బర్ బాద్ బంకర్ కథలో)

అమర్ దీప్ అనే కథలో ఆటపాటలతో ఆడుకోవాల్సిన పసి వయసులోనే మిలటరీలో చేరడానికి చూపే ఉత్సాహాన్ని చిత్రీకరించారు. ఈ కథలోఅమర్ దీప్ అనే పసిపిల్లవాడు తన చిన్నతనం నుండి "పొరుగింటి కిటికీలోంచి టెలివిజన్ లో వచ్చే రిపబ్లిక్ డే పెరేడ్ లో సైనిక కవాతుని ఎంతో ఆశక్తిగా చూస్తూ ఆకుపచ్చరంగు దుస్తుల్లో ఉన్న సైనికుల్ని తమ సోదరులుగా భావిస్తుండేవాడు. వాళ్లల్లో తనూ ఒకడు కావాలని కలలు కనేవాడు. తనకా భాగ్యం కలిగించమని భగవంతుని పదేపదే వేడుకునేవాడు. అతని ప్రార్థన ఫలించినట్లు మిలిట్రీ రిక్రూట్మెంటులో సెలక్టయ్యాడు. ఆ రోజు అతని ఆనందానికి అవధులులేవు. ఇంట్లో అందరికీ మిఠాయిలు పంచాడు. ఇరుగుపొరుగు వారికి మిత్రుల కుటుంబాలకూ మిఠాయిలు పంచాడు" అంటారు రచయిత.

ఒక సైనికుడు యుద్ధానికి వెళ్లేముందు ఇంటివారికి రాసే ఉత్తరంలోని అంశం"18 గ్రెనెడియర్స్ అనే కథలో" 'నేనొక గమ్యం తెలియని ప్రాంతానికి వెళ్తున్నాను, అది చాలా ప్రమాదకరమైన ప్రాంతం. నేను ఉత్తరం రాయడం ఆలస్యం కావచ్చు. నువ్వేమీ ఆందోళన చెందవద్దు. సైనికులకు ప్రమాదాలు జీవితంలో ఒకభాగం. మేము ఎప్పుడూ చావుకి భయపడం, ధైర్యం గలవారికి ఒక్కసారే మరణం. .... నాదృష్టిలో మాతృభూమి రక్షణలో మరణించడం చాలా గొప్ప మరణం.... నువ్వు వీర పత్నివి. సమయం అవుతుంది. నేను యుద్ధ భూమికి వెళ్లాలి. ఇంతకన్నా రాయటానికి సమయం లేదు. ఉంటాను.. ప్రేమతో విశ్వం.(18 గ్రెనేడియర్స్)'

యుద్ధభూమి సమతల ప్రదేశం కాదు. ఏమాత్రం అనువుగాలేని నిట్టనిలువుగానున్న పర్వత శిఖరాలు. శిఖరంపైనుండి శత్రువులు జారవిడుస్తున్న తూటాలకు తప్పించుకుంటూ శత్రుసంహారానికై తుపాకుల్ని ఎక్కుపెట్టుతూ అడుగడుగుగా పైకి ఎగబాకాలి. రక్తం గడ్డకట్టే చలిలో ప్రయాణం.

యుద్ధభూమి సమతల ప్రదేశం కాదు. ఏమాత్రం అనువుగాలేని నిట్టనిలువుగానున్న పర్వత శిఖరాలు.

కొండ ఎక్కడానికి పట్టుదొరకాలి. ఒక్కొక్క చోట ఒంటి చేత్తో అందిన రాయిని పట్టుకుని ఊపిరి బిగబట్టుకుని అతి కష్టంమీద పైకి ఎగబాకుతూ రెండోచేత్తో శత్రు సంహారం చేయడానికి తుపాకీ పట్టుకుని అప్రమతంగా ఉండాలి. పట్టు తప్పితే పర్వతం పైనుంచి జారిపోతారు. ఇలాంటి భయంకర యుద్ధానుభవం గతంలో ఎప్పుడూ ఎదురుకాలేదు. అలాగని వెనుకడుగువేసే ప్రసక్తే లేదు. ఎందరు వీరస్వర్గం అలంకరించినా విజయాన్ని సాధించితీరాలి. ఈ సుస్థిర నిర్ణయంతోనే భారతసైన్యం ముందుకు సాగుతుంది(బొల్లారం బొబ్బులి).

> శత్రువుల వ్యూహాన్ని భగ్నం చేయాలంటే అంతకన్నా మించిన వ్యూహానికి మనం ప్రణాళిక వేసుకోవాలి.

శత్రువుల వ్యూహాన్ని భగ్నం చేయాలంటే అంతకన్నా మించిన వ్యూహానికి మనం ప్రణాళిక వేసుకోవాలి. అలాంటిదే టోలోలింగ్ శిఖరాన్ని స్వాధీనం చేసుకోడానికి వేసుకున్నారు. తుదిదాడి మొదలుపెట్టడానికి వారంముందు అచ్చం టోలోలింగ్ శిఖరంలాంటి మరో శిఖరంమీద ప్రాక్టీసుదాడి చేశారు. తర్వాత మట్టితోనూ, ఇసుకతోనూ, రాళ్లతోనూ టోలోలింగ్ నమూనాశిఖరాన్ని రూపొందించుకుని దాడి చేయడానికి ఉపయోగించాల్సిన మార్గాలను అధ్యయనం చేసి పథకాలు రచించారు. ప్రయోగం చేసే సమయంలో చాలా కాలంగా నిల్వ ఉంచిన మందుగుండులో పనికిరాని గ్రెనేడ్లను గుర్తించి పారేశారు. కొండలమీదికి పెద్ద మొత్తంలో మందుగుండు సామగ్రిని చేరవేయటంలో సైనిక దళానికి చెందిన రజకులు చర్మకారులు క్షురకులు ఒక్కో సైనికుడికి నలుగురుచొప్పున సహాయపడ్డారు. (బర్ బాద్ బంకర్ కథలో)

హెలికాప్టర్ టోలోలింగ్ సమీపిస్తుండగా శత్రుస్థావరంనుంచి క్షిపణి మృత్యు శరంలాగా దూసుకువచ్చి రెప్పపాటులో హెలికాప్టర్ని తాకి పేలిపోయింది. మంటలుకమ్ముకున్న హెలికాప్టర్ లోని సైనికులు పైలెట్ క్యాబిన్ లోకి చేరారు. పైలట్ సాంకేతిక శక్తినంతా వినియోగించి

చూస్తున్నాడు. సైనికుల్లో పెద్దవారు అనుభవజ్ఞుడు పైలట్ భుజమ్మీద చేయివేసి "లాభంలేదు. మనం వీరస్వర్గం అలంకరింబోతున్నాం. మళ్ళీ భారతమాత పుత్రులుగా పుట్టి తిరిగి భారతమాత సేవలో జీవితాలు గడిపే అవకాశం ఇమ్మని దేవుని ప్రార్థిద్దాం" అన్నాడు. అందరూ మౌనంగా ప్రార్థనలు చేసుకుంటుండగా హెలికాప్టర్ జటాయువులా, రెక్కలు తెగిన పక్షిలా హిమశిఖరాలమీద కూలి ముక్కలు ముక్కలైంది. (మి-17 కథలో)

క్షతగాత్రులయిన సైనికులు మనఃస్థితి ఎలా ఉంటుందనేందుకు రాకీనాబ్ అనే కథలో యుద్ధ భూమిలో తూటాలకు గురై స్పృహతప్పి కొండపైనుంచి పట్టుదప్పి జారిగాయాలపాలైన కేప్టన్ అజిత్ సింగ్ ను సహాయక బృందాలు ఆస్పత్రిలో చేర్చారు. కొంతకాలానికి అతనికి స్పృహ వచ్చింది. కమాండర్ వచ్చి పరామర్శించాడు. వెంటనే "సర్...నాకిప్పుడు బాగానే ఉంది. యుద్ధంలోకి పంపించండి సార్...."ప్రాధేయపూర్వకంగా అడుగుతున్నాడు. కమాండర్ అతనికేసి ఆశ్చర్యంగా చూస్తూ "ఆ సంగతి చెప్పాల్సింది నువ్వుకాదు డాక్టరుగారు...." మంచంమీద వెనక్కి వాలిన అజిత్ సింగ్ కు 'రాకీనాబ్' యుద్ధక్షేత్రం కళ్ళముందు కదలాడుతుంది. "వెళ్లాలి... త్వరగా వెళ్లాలియుద్ధరంగానికి వెళ్లాలి..." తనలో తాను అనుకుంటున్నాడు.ఈ కథల్లో అనుక్షణం యుద్ధ క్షేత్రంలో ఏమి జరుగుతుందో, నా అవసరం అక్కడ ఉంది, తొందరగా అక్కడికి నేను చేరుకోవాలి, దేశ రక్షణే ప్రధానం అనే తపన క్షతగాత్రులైన ప్రతి సైనికుడిలో ఉన్న భావనను రచయిత మనముందు ఉంచారు.

సైనికులు చనిపోయిన తర్వాత ఆ కుటుంబసభ్యుల మనోగతాలను చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. కుటుంబంలోని వ్యక్తి మరణాన్ని వీరమరణంగా భావించే ఉదాత్తమైన గుణం ఆ కుటుంబ సభ్యులలో అలవడడం అన్నది దేశభక్తికి నిదర్శనం. రాథోడ్ అనే కథలో శైలేష్ రావల్ అనే విలేఖరి వెళ్లి సైనికుడి

**సైనికులు చనిపోయిన తర్వాత ఆ కుటుంబసభ్యుల మనోగతాలను చూస్తే ఆశ్చర్యం వేస్తుంది.**

భార్యను పరామర్శిస్తాడు. "మీ భర్తగురించి బాధ పడుతున్నారా అని సానుభూతితో ప్రశ్నిస్తాడు. అందుకు సమాధానంగా సైనికుడి భార్య రాజశ్రీ లేదు, గర్వపడుతున్నాను. ఆయన దేశంకోసం ప్రాణత్యాగం చేశారు. ఆ అదృష్టం అందరికీ రాదు. "రోగాలతో, రొష్టులతో మరణించేకన్న వీరమరణం ఎంతో గొప్పది" అని చెపుతుంది. అలాగే టైగర్ హిల్ కథలో గ్రామం అర్ధరాత్రి నిద్రమత్తులో జోగుతున్నవేళ దబదబా తలుపులుకొట్టి నిద్రమత్తులో వచ్చిన తండ్రికి "మీ అబ్బాయి యుద్ధంలో వీరమరణం పొందాడు" అని శవాన్ని అప్పగించిన వేళ కుప్పకూలి తట్టుకుని నిలబడి, బావురుమంటున్న భార్యను ఓదారుస్తున్నాడు. "ఏడవకు ఏడ్చి మన పుత్రుడి త్యాగాన్ని అవమానించకు"అంటాడు. ఇలాంటి అంశాలను హృదయవిధారక రోదన దృశ్యాలుగా కాకుండా దేశరక్షణలో త్యాగనిరతికి ప్రతీకలుగా కుటుంబసభ్యులను చిత్రీకరించడంలో రచయిత సైనిక వ్యవస్థలోని నిజాయితిని గుర్తించడం కన్పిస్తుంది.

> అంతేకాదు యుద్ధంలో వీరమరణం పొందిన అన్నగారిని చూసుకుంటూ "ఎప్పుడు ఎదిగి ఆర్మీలో చేరుతామా" అనే తమ్ముళ్లిద్దరూ ఎదురుచూస్తున్నారు

అంతేకాదు యుద్ధంలో వీరమరణం పొందిన అన్నగారిని చూసుకుంటూ "ఎప్పుడు ఎదిగి ఆర్మీలో చేరుతామా" అనే తమ్ముళ్లిద్దరూ ఎదురుచూస్తున్నారు అంటాడు అమరదీప్ కథలో. అలాగే మహావీర్ మేజర్ వాంగ్ చుక్ కథలో వాంగ్ చుక్ అనే మేజర్ కార్గిల్ యుద్ధంలో విజయం సాధించి ఇంటికి రాగానే కొడుకుని గాఢంగా ఆలింగనం చేసుకుని ముద్దుపెట్టుకుంటుంటే కొడుకు "నాన్నా నన్ను యుద్ధంలోకి ఎప్పుడు తీసుకు వెళ్తావ్" అని అడుగుతాడు. తండ్రి ఆనందంతో "దేశం పిలిచినపుడు" అని గర్వపడుతూ సమాధానం ఇస్తాడు.

ఆ యుద్ధభూమిలో విజయోత్సవం ఎలా ఉంటుందంటే సిపాయిలు

ఉల్లాసంతో కేరింతలు కొడ్తూ తమ ఆయుదాలను గాల్లోకి ఎత్తిపట్టుకుని ఆనందం పంచుకుంటారు. శత్రుస్థావరాలను వశం చేసుకున్నప్పుడు శత్రుసైన్యం సమృద్ధిగా నిల్వ ఉంచిన నెయ్యి, తేనె, డబ్బాల్లో భద్రపరచిన అనాసపండ్లు, వెన్న ప్యాకెట్లు మన సైనికుల విజయోత్సవ విందుగా ఉపకరించుకుంటారు(బర్ బాద్ బంకర్ కథలో). కార్గిల్ యుద్ధక్షేత్రంలో ఒక స్థావరాన్ని చేజిక్కించుకోడానికి తీవ్రస్థాయిలో పోరాడాల్సివచ్చింది. పదిమంది భారతజవాన్లు వీరోచితంగా పోరాడి వీరమరణం పొందారు. అయినా పట్టువదలక ఆ స్థావరాన్ని కైవశం చేసుకున్నారు. మరణించిన శత్రుసైనికుల మృతదేహాలను పరీక్షిస్తూ పరిసరాలను గమనించినపుడు అక్కడ ఆరునెలలకు సరిపడా రేషన్ కన్పించింది. అంటే శత్రువుల ఆలోచన అక్కడే తిష్టవేసుకుని భారత భూబాగంపై సుదీర్ఘ యుద్ధానికి సన్నద్ధమయ్యారని తెలుస్తుంది. (వందేమాతరం కథలో)

యుద్ధభూమిలో శత్రువులు పటిష్టమైన స్థావరాలను ఏర్పరచుకున్నారు. వందల్లోఉన్న శత్రుసైన్యాన్ని మట్టుబెట్టడానికి మనకి వేలల్లో సైనికుల్ని వినియోగించాల్సి వచ్చిందంటే యుద్ధరంగం ఎంత ప్రతికూలంగా ఉందో గ్రహించవచ్చు. ఫిరంగి గుళ్లతో ఏర్పడిన గుంతలను భారతసైనికులు తలదాచుకోడానికి వినియోగించుకున్నారు. ఎన్నో ఎదురుదెబ్బలు తట్టుకుని 74 రోజుల భీకరపోరాటం జరిపిన భారత సైన్యం విజయం సాధించింది. ఇంతటితో యుద్ధంపూర్తి అయింది అనుకుంటే అది తాత్కాలికమే. మరోసారి ఆ ప్రాంతం శత్రువశం కాకుండాయుద్ధం పునరావృతం కాకుండా వాస్తవాధీన రేఖవద్ద అయిదు బ్రిగేడ్ల సైన్యంతో పహరా నిరంతరం కాయాల్సిన పరిస్థితి ఉందని యుద్ధంవల్ల తెలిసింది. కొండలమీద 20 అడుగుల ఎత్తున మంచు పేరుకుపోతుంది. ప్రతి సంవత్సరం సెప్టంబరుకల్లా అక్కడికి ఆహార పదార్థాలు చేరవేసి నిల్వ ఉంచాలి. కొత్త ఆయుధాగారాలు, బంకర్లు, కంచర గాడిదలకు దారులు సిద్ధం చేసుకోవాలి- ఇలా కార్గిల్ యుద్ధ క్షేత్రంలో నిరంతరం పహరా కాస్తూ సైనిక సంచారం ఉంటూనే ఉండాలి. ఋతువులు మారతాయి. కానీ అక్కడి సైనికుల బాధ్యతలు మారవు...... పరిస్థితి పునరావృతం కాకుండా చూసుకోవడమే తక్షణ కర్తవ్యం (ఆపరేషన్ విజయ్ కథలో).

వీరమరణం పొందినవారి యూనీఫామ్ ని జబల్ పూర్ లోని సైనిక పురావస్తు ప్రదర్శనశాలలో ఉంచుతారు. వారి పార్థివదేహాన్ని కుటుంబసభ్యులకు అప్పగించి సైనిక మర్యాదలతోఖననమ్/దహనం చేయిస్తారు. ప్రభుత్వం కుటుంబానికి సహాయనిధి ప్రకటిస్తుంది. స్మారకచిహ్నంలో వీరమరణం సైనికుడి పేరు నమోదు చేస్తారు. సందర్శకులు స్మారక చిహ్నాలకు జోహార్లు అర్పిస్తుంటారు.

ఈ కథల్లో యుద్ధభూమిలో క్షతగాత్రులైన సైనికుల అవస్థలు, మరణించిన సైనికుల పార్థివ దేహాలను తరలించే ఇక్కట్లు, మంచులో కూరుకుపోయిన సైనికులను కాపాడే విధానాలు, దారి తప్పిపోయిన సైనికుల జాడ తెల్సుకుని వారిని తిరిగి తమ దోవకు రాబట్టడం, నీళ్లు, ఆహారం సరైన సమాయానికి చేరక అలమటించిన విషయాలు అనేకం ఉన్నాయి. తోటి సైనికులు మరణించినపుడు గౌరవవందనం చేసి మరుక్షణమే కదనరంగంలోకి దూకవలసిన స్థితిలో సైనికుల మనస్థితిని, క్షతగాత్రులైన వారు శత్రు సంహారం చేయలేకపోతున్నానమనే వెతల, దేశ సేవలో మరణం లభించలేదనే ఆవేదన వంటి అనేక అంశాలు ఈ కథల్లో చిత్రీకరించారు.

> క్షతగాత్రుల్ని, మృతవీరుల్ని యుద్ధ భూమినుంచి తరలించే సమయంలో వారిమీద శత్రువులు కాల్పులు జరపకూడదన్న నిబంధనను శత్రుమూక తుంగలోదొక్కి కాల్పులు జరుపుతూ ఆటంకాలు కలిగించడం,

క్షతగాత్రుల్ని, మృతవీరుల్ని యుద్ధ భూమినుంచి తరలించే సమయంలో వారిమీద శత్రువులు కాల్పులు జరపకూడదన్న నిబంధనను శత్రుమూక తుంగలోదొక్కి కాల్పులు జరుపుతూ ఆటంకాలు కలిగించడం, మృతదేహాలను దాచిపెట్టేయడం, క్షతగాత్రుల్ని యుద్ధఖైదీలుగా బందించడం వంటి దుశ్చర్యలకు పాల్పడు శత్రుదేశంపై పెల్లుబికిన దేశపౌరుల నిరసనలు చెప్పనలవికాదు. చనిపోయిన, క్షతగాత్రులైన సైనికులకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు

యుద్ధసమయంలో ప్రకటించే రాయితీలు, సౌకర్యాలు దక్కకుండా అధికారులు చేసే దుర్బుద్ధిపనులను ప్రభుత్వ వైఫల్యాలను కూడా రచయిత నిర్భయంగా ఎండగట్టారు.

ఈ కథల్లోని పేర్లద్వారా తెలుస్తున్న మరో అంశం సైనికుల్లో చాలావరకు ఉత్తర భారతదేశంలోని పంజాబు, గుజరాత్, హర్యానా రాష్ట్రాలకు చెందినవారే అధికంగా కన్పిస్తున్నారు. అందుకు ప్రధానకారణం శత్రుచర్యలను అక్కడివారు గమనించినంతగా ఇతర రాష్ట్రాలవారు గమనించకపోవడం కావచ్చు. కుటుంబసభ్యులు, దేశ ప్రజలు సైనికాధికారులకు, సైనికులకు బరోసాగా నిలబడుతున్న అంశాలు అనేకం ఇందులో చిత్రీకరించారు. భారత భూభాగంలో శత్రుదేశం చేస్తున్న అరాచక కార్యాలు, ముష్కరులల్లే దొంగచాటుగా చేస్తున్న ముజాయిదీన్ల చొరబాట్లు, ఐ.ఎస్.ఐ ముసుగుతో పాకిస్థాన్ ప్రభుత్వం ఆడుతున్న దొంగాటలు ఉన్నంతకాలం ఈ రెండు దేశాల మధ్య యుద్ధాలు సాగుతూనే ఉంటాయన్నది రచయిత భావన. భారత ప్రభుత్వం త్రిదళాలతో మూకుమ్మడి దాడులతో ముష్కరుల వ్యూహాలను తిప్పికొడుతూనే ఉంటుంది. స్వాతంత్ర్యం సిద్ధించిన 1947 నుండిదొంగచాటు దాడులు సాగుతూనే ఉన్నాయి. ఎన్ని సార్లు బుద్ధిచెప్పినా తోకముడిచి కూర్చోకుండా మళ్లీమళ్లీ మన దేశంపైకి వస్తూనే ఉన్నారంటే ప్రపంచంలోని కొన్ని దేశాలు పాకిస్తానుకు అందిస్తున్న పక్కబలం, ఆర్థిక సహకారం, ఆయుధ సరఫరా ఇలా ఎన్నో. వీటన్నింటినీ భారతదేశం ఒంటి చేత్తోఎదుర్కొంటుందంటే అందుకు మన జవాన్ల వీరోచిత పోరాటం దానికై మద్దతు పలుకుతున్న దేశ ప్రజల మనోబలం చాలా గొప్పది. ఈ బలంతోనే భారత ప్రభుత్వం దన్నుగా నిలబడగలుగుతుంది. భారత దేశంలోని ప్రతి వ్యక్తి కూడా తనదైన శైలిలో దేశ

ఈ కథల్లోని పేర్లద్వారా తెలుస్తున్న మరో అంశం సైనికుల్లో చాలావరకు ఉత్తర భారతదేశంలోని పంజాబు, గుజరాత్, హర్యానా రాష్ట్రాలకు చెందినవారే అధికంగా కన్పిస్తున్నారు.

ఔన్నత్యాన్ని కాపాడే దిశగా ఎదుగుతూ ప్రతి ఒక్కరూ మేరా భారత్ మహాన్ లు కావాలని శపథం పట్టాలి అన్న భావన కల్గించే కార్గిల్ కథలు రచించిన రచయితకు తెలుగు సమాజం ఎల్లప్పుడూఋణపడిఉంటుంది.

సృజన రంగంలో ఇలాంటి సంఘటనాత్మక చిత్రమాలికల రచనలవల్ల సమాజగత కల్లోలాలను ప్రజలు అర్థంచేసుకుని భవిష్యత్తులో ఇలాంటివి జరగకుండా ఉండాలనే భావనను పెంచుకోవడం, అప్రమత్తంగా ఉండాల్సిన విషయాలను జాగరూకరించుకోవడం, దేశ భవిష్యత్తుకై ప్రగతిమార్గంవైపు పయనించడం వంటి ప్రయోజనాల్ని గుర్తుచేస్తుందని భావించవచ్చు.

## ఉపయుక్త గ్రంథాలు :


1. రవీంద్ర త్రివిక్రమ కాటూరు :
   2012, కార్గిల్ కథలు, చినుకు పబ్లికేషన్స్, విజయవాడ.
2. సుబ్బారెడ్డి మద్దూరి: 1982, జాతీయోద్యమ కవిత్వం, రాగసుధా ప్రచురణలు, తిరుపతి.
3. సంజీవరావు తూమాటి : 2017, తెలుగు సాహిత్యంలో దేశభక్తి, తెలుగు భాషా వికాస పరిషత్, చెన్నై-49.
4. భక్తవత్సలరెడ్డి. ఎన్.: 1986స్వాతంత్ర్యోత్తర కాలాన తెలుగు కవిత, నాగపట్ల పబ్లికేషన్స్, హైదరాబాదు.
5. నరసింహ శాస్త్రి నోరి : 1979, సారస్వత వ్యాసములు(5 వ సం.) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు.
6. నారాయణరెడ్డి.సి.:1989, ఆధునికాంధ్రకవిత్వము- సంప్రదాయములు: ప్రయోగములు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు.




# కుందుర్తి 'సింహాసన' తిరుగుబాటు ధోరణులు



ఆచార్య విస్తాలి శంకరరావు
94452 03041



ఈ లోకంలో రోజుకు ఎంతోమంది కవులు పుడుతూ ఉంటారు... గిడుతూ ఉంటారు. కానీ కాలాలు మారినా, కొందరు చరిత్ర పుటలలో ప్రముఖమైన స్థానాన్ని అలంకరించి, భవిష్యత్తు తరాలకు వారు అందించిన స్ఫూర్తి నిరంతరం చైతన్యంలా జ్వలిస్తుంది. "సుకవి జీవించు ప్రజల నాల్కల యందు" అన్న జాషువాగారి మాటలు ఎందరో మహాకవులకు అన్వయం అవుతుంది. అటువంటి కవులలో ఎంతో స్ఫూర్తి దాయకమైన సాహిత్యాన్ని అందించిన సాహితీవేత్త కుందుర్తి ఆంజనేయులు గారు. వీరు అందించిన చైతన్యం అటు దేశచరిత్రలోను, ఇటు సాహితీ చరిత్రలోను సువర్ణాక్షరాలతో లిఖించబడిరది. కనుకనే వారు అందించిన చైతన్యాన్ని మననం చేసుకుంటూ సభలు, సమావేశాలు జరుపుకుంటూ స్ఫూర్తిని పొందుతూనే ఉన్నాం.

అనిసెట్టి సుబ్బారావు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, కుందుర్తి ఆంజనేయులు ఈ ముగ్గురు నయాగర కవులుగా నామకరణం చేసుకుని అపురూపమైన సాహిత్యాన్ని సృష్టించారు. అటువంటి వారిలో కుందుర్తి సేవలు ఎంతో విశేషం. సమకాలీన సమాజానికి అవసరమైన, అనుకూలమైన సాహిత్యం అవసరం అని భావించి "వచన కవితా" ఉద్యమానికి ఊపిరి పోసి వచన కవితా పితామహుడుగా నిలిచారు. అంతేకాదు 1967లో ఫ్రీవర్స్‌ఫ్రెంట్ ను స్థాపించారు. వీరు గుంటూరు జిల్లాలోని నరసరావుపేట దగ్గరలోని కోటవారి పాలెంలో 1922 డిసెంబర్ 16న జన్మించారు. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయి, తాతగారి సమక్షంలో పెరిగారు. అక్కడే ఇతిహాసాల పట్ల మంచి అవగాహన కలిగి ఉన్నారు.

బాల్యం నుండి వీరి వ్యక్తిత్వంపై కమ్యునిష్టుల ప్రభావం ఉండడంతో వీరి ఆలోచన విధానంలోను, నూతనత్వం ఏర్పడి, ముఖ్యంగా ప్రముఖ కమ్యునిష్టు నాయకులు పలుపుల శివయ్యగారి ప్రభావం కందుర్తిగారిపై అధికంగా ఉంది.

బాల్యం నుండి వీరి వ్యక్తిత్వంపై కమ్యునిష్టుల ప్రభావం ఉండడంతో వీరి ఆలోచన విధానంలోను, నూతనత్వం ఏర్పడి, ముఖ్యంగా ప్రముఖ కమ్యునిష్టు నాయకులు పలుపుల శివయ్యగారి ప్రభావం కందుర్తిగారిపై అధికంగా ఉంది. అలాగే విశ్వనాథ సత్యనారాయణ శిష్యరికం కూడా చేశారు. కుందుర్తి వినుకొండలో చదివే రోజుల్లో జాషువాగారి కవిత్వాన్ని ఎంతో శ్రద్ధగా చదివేవారు. అందులోను జాషువాగారి పిరథౌసి కావ్యం అంటే వీరికి ఎంతో ఇష్టం.

ఇలా కుందుర్తిపై ఆధునిక కవులతోపాటు కవిత్వ ధోరణుల ప్రభావం కూడా ఎక్కువగా ఉండేది. కనుక ప్రజాకవిత్వం సామాన్యులకు సైతం అందుబాటులోకి వచ్చి ప్రజలు చైతన్యవంతం కావాలంటే "వచన కవిత్వమే" సరైన మార్గం అని విశ్వశించి ఆ మార్గాన్ని అనుసరించారు కుందుర్తిగారు.

అక్షరానికి `సాహిత్యానికి ఎలాంటి అనుబంధం ఉంటుందో అలాగే జీవితానికి, సాహిత్యానికి, సమాజానికి కూడా అలాంటి విడదీయరాని అనుబంధమే ఉంటుంది. అంతేకాదు అవి బింబ ప్రతిబింబాలు కూడా, ఒకదానిపై మరొకటి ప్రభావం ఉంటూ రెండు కలిగలసి ముందుకు సాగుతూ ఉంటాయి.

ఈ నేపథ్యంలో ప్రజాకవిగా, అభ్యుదయ కవిగా, ఆధునిక కవిగా ఇంకా చెప్పాలంటే విలక్షణ సాహిత్యకారునిగా, చైతన్యవంతమైన కవిగా ఎదిగిన కుందుర్తి జీవితమే కాదు సాహిత్యం సయితం చారిత్రక, సామాజిక చైతన్యానికి నిలువుటద్దంగా నిలుస్తాయి అనడంలో సందేహంలేదు.



అందులోనూ ముఖ్యంగా వారి... నగరంలో వాన, నాలోని నాదాలు, సౌప్తికం, రసధుని, అమావాస్య, ఋతువులు, నా ప్రేయసి, నయాగారా, తెలంగాణా, హంస ఎగిరిపోయింది ఇలా అనేక రచనలు చేశారు. ప్రతి రచన ఒక విలక్షణమైనదే. అయితే అన్ని రచనలను ఒక వ్యాసంలో విశ్లేషించడం సాధ్యమయ్యేపని కాదు కాబట్టి వారి రచనలలోని ఒక రచనను పరిశీలించి వారి సాహిత్య విశిష్టతలను పరిశీలిద్దాం.

మారుతున్న పరిశోధనా రంగంలో, నూతన ధోరణులలో ఎంచుకునే అంశం పరిధి తక్కువగా ఉండి విషయ విశ్లేషణ ఎక్కువగా ఉంటే ఆ కావ్య ప్రయోజనం ఎక్కువగా చెప్పే అవకాశం ఉంటుందని నేటి పరిశోధకుల ఆలోచన. ఇది సరైన ఆలోచనే అని నా భావన కూడా. ఉదా॥ అన్నం ఉడికిందా లేదా అని తెలుసుకోడానికి ప్రతి మెతుకుని పట్టిచూడాల్సిన అవసరం లేదు. ఒక్క మెతుకుని పరిశీలిస్తే విషయం తెలిసిపోతుంది. కనుక నా పరిశోధన వ్యాసం పరిధి కూడా విస్తృతం కాకుండా, ఒక కావ్యంలో కేవలం ఒక కవితా శీర్షికనే విశ్లేషించాలని నిర్ణయించడమైంది. దానిలో భాగంగా ప్రస్తుత నా పరిశోధనా వ్యాసం తెలంగాణా కావ్యంలోని "సింహాసన" అనే ఖండిక ఆధారంగా కుందుర్తి ఆలోచనా తీరు, అందించిన చైతన్యం, సమకాలీన ఇతివృత్తం ఎంచుకోవడంలోగల ప్రయోజనం, ఆ ఇతివృత్తం కాలం చెల్లిపోయినా నాటి ఆలోచనలు, సంఘటనలు ఈ నాటికీ ఎలాంటి చైతన్యాన్ని నినదిస్తున్నాయి, ప్రజలపై ఎలాంటి ప్రభావాన్ని కలిగి ఉన్నాయి అన్న విషయాలు చర్చించడమే ఈ వ్యాసం ఉద్దేశం.

## 'సింహాసన' విశ్లేషణ

ఈ 'సింహాసన' అనే ఖండిక 'తెలంగాణా' అనే కావ్యంలోనిది. ఈ ఖండిక చరిత్ర పుటలలోని ప్రజల యదార్థ జీవిత చిత్రణను కళ్ళముందు

ఉంచుతుంది. తెలంగాణా ప్రాంతం పోరాటాలకు పురిటిగడ్డ. తరతరాలుగా అనేక మంది దగాకోరుతనానికి బలైపోయిన జీవితాలకు ఈ గడ్డ నిలయమైనది. కనుకనే ఆ నిరంకుశ ధోరణులను ఎదిరిస్తూ చేసిన అనేక పోరాటాలు ఈ నేలపై పురుడు పోసుకుని ప్రజలను చైతన్య వంతులుగా చేశాయి. అటువంటి తెలంగాణ గడ్డపై జరిగిన ఒక సంఘటనకు ప్రతి రూపమే ఈ 'సింహాసన' అనే ఖండికలోని ప్రధాన ఇతివృత్తం.

తెలంగాణాలోని హైదరాబాద్, ఆసఫ్ జాహి వంశీయుల పాలనలో ప్రభువులు నిరంకుశలై, మతోన్మాదులై, ప్రజల సంక్షేమాన్ని విస్మరించి ప్రజలను అనేక ఇబ్బందులకు గురి చేస్తున్నారు. అంటే భారతదేశాన్ని పాలించిన ఏ ముస్లిం చక్రవర్తి కాలంలోను ఇక్కడ జరిగినటువంటి దారుణమైన పరిస్థితులు లేవు. ఇక ఆ ప్రాంత ప్రజల విషయాన్ని గమనిస్తే దుర్భరమైన దారిద్ర్యంతో, అనేక అవమానాలకు గురయ్యారు. ఆ అంశాలను ఇతివృత్తంగా తీసుకుని 1955లో కుందుర్తి ఆంజనేయులుగారు "తెలంగాణ" అనే వచన కావ్యాన్ని రాశారు.

భారతంలో 18 పర్వాలు ఉన్నట్లే కుందుర్తి ఆంజనేయులుగారు కూడా ఈ తెలంగాణ కావ్యంలో 18 కవితా శీర్షికలలో తెలంగాణ ప్రజల జీవన విధానాన్ని, పోరాట పటిమను ఆవిష్కరించారు. ఆ 18 కవితా ఖండికలు. 1. ప్రస్తావన, 2. సింహాసన, 3. బీజోత్పన్న, 4. సంఘోదయ, 5. ప్రజోద్యమ, 6. రాయబార, 7. బహిష్కార, 8. అజ్ఞాత, 9. మానభంగ, 10. గృహదహన, 11. ప్రతిఘటన, 12. దిగ్విజయ, 13. భూమిదాన, 14. న్యాయదాన, 15. రజాకార, 16. దురాగత, 17. దండయాత్ర, 18. ఉపసంహార.

ఈ కవితా శీర్షికల పేరు వింటేనే ఈ "తెలంగాణ" రచన ఎంత వైవిధ్యం, విశిష్టత కలిగి ఉందో తెలుస్తుంది. ప్రతి ఖండికకు పెట్టిన పేరులో కూడా ఎన్నో విశేషాలు స్ఫురిస్తున్నాయి. అందులోని ఒక విశిష్టమైన కవితా శీర్షికే ఈ 'సింహాసన'.

ఇక ఈ 'సింహాసన'ను పరిశీలిద్దాం.

ఆనాడు దేశంలో అనేక సంస్థానాలు వివిధ రాజుల ఆధీనంలో జీవనం

కొనసాగించేవి. అటువంటి సంస్థానాలలోకెల్ల అతిపెద్ద సంస్థానం హైదరాబాద్. దీనిని కుందుర్తి మాటలలో చూస్తే...

"దేశంలోని సంస్థానాలన్నిటిలో
హైదరాబాదు పెద్దది
భూస్వామికం బాధల్ని ప్రజలు సహించిన
చిట్ట చివరి హద్దు"

అప్పటికే అనేక సంస్థానాలు భారత ప్రజాస్వామ్యంలో విలీనం కాగా, నిజాం పాలకులు ఈ తెలంగాణా సంస్థానంపై పట్టును కొనసాగిస్తూనే ఉన్నారు. నిజానికి తెలంగాణాలో వనరులు పుష్కలంగా ఉన్నా ప్రజల జీవితాలు మాత్రం దుర్భరంగానే ఉన్నాయి. అంటే తమ చుట్టూ ఉన్న ప్రాంతాలకు రాజుల కబంధ హస్తాల నుండి విముక్తి కలిగినా హైదరాబాదు మాత్రం ప్రత్యేకంగా నిజాం పాలకుల ధౌర్జన్యాలకు, దోపిడికి ఇంకా బలైతూనే ఉంది అని కుందుర్తి తన సింహాసన కవితలో ఎంతో ఆవేదన చెందుతారు.

"హైదరాబాద్ ఒక లంక" అని దాని లక్షణాలను ఇలా బయటపెట్టారు. మరి ఈ సింహాసనాన్ని అదిష్టించిన పాలకులు ప్రజలకు చేసిన మోసాలు అన్నీ ఇన్నీ కావు. ఈ ప్రాంతంలో సస్యశ్యామలంగా గోదావరి జలాలు పారుతున్నా, ఎటువంటి అభివృద్ధికి నోచుకోక ప్రజలు దరిద్రమైన జీవితాలను గడిపే నిరుపేదలు, అమాయకులకు ఈ ప్రాంతం నిలయంగా మారాయని ఆక్రోషించారు కుందుర్తిగారు.

"అవి పావన గోదావరి జలాలు
అభిషేకించిన కమ్మని పొలాలు
కాదవి ` నిరంతర దరిద్ర జీవితాలు
వలయించిన అమాయకుల నిలయాలు"

అని ప్రజల జీవితాలను చిత్రించడమేకాక, ప్రజలు అమాయకత్వంతో ఎలా జీవిస్తున్నారో కూడా స్పష్టంచేశారు. ఇంకా ఈ సంస్థానం గురించి ప్రస్తావిస్తూ, 'ఈ హైదరాబాద్ సంస్థానం మన దేశమనే కడుపులో పుట్టిన పుండు'గా వ్యక్తీకరించడంతో ఆ ప్రాంత ప్రజల ఆవేదనలు ఎలా ఉన్నాయో

తెలియజేస్తారు కుందుర్తి. మరి ఆ పుండుకు శస్త్ర చికిత్స ఎప్పుడో అని సందేహాన్ని వ్యక్తం చేస్తారు. నిజాం పాలన నుండి హైదరాబాద్ విముక్తి కాక ముందు అక్కడి ప్రజల జీవన గాథలు ఎలా ఉన్నాయో తెలియజేయడమేకాక ఆ బాధల నుండి ఎప్పుడు విముక్తి కలుగుతుందో అని ఆ రోజు కోసం కుందుర్తి ఎదురుచూశారు.

> హైదరాబాద్ సంస్థానంలో జరిగిన మోసాలను, ప్రజల స్థితిగతులను, రాజుల పాలనను అన్నిటిని కవి ఈ "సింహాసన" అని పేరు పెట్టి ఎంతో ప్రతీకాత్మకతగా తెలిపారు.

హైదరాబాద్ సంస్థానంలో జరిగిన మోసాలను, ప్రజల స్థితిగతులను, రాజుల పాలనను అన్నిటిని కవి ఈ "సింహాసన" అని పేరు పెట్టి ఎంతో ప్రతీకాత్మకతగా తెలిపారు. కుందుర్తి గొప్పకవి, రచయిత కాబట్టి తాను చెప్పదలచుకున్న అంశాలను వర్ణనాత్మక శైలిలో వివరిస్తూ సాహిత్య సొగసులను అద్దారు. ఎలా అంటే నిజాం రాజుల పాలన ఎంత దుర్మార్గంగా ఉన్నా అంత సవ్యంగా ఉన్నట్లుగానే అక్కడ ప్రచారం జరిగింది.

సాధారణంగా మన సాహిత్యంలో, ముఖ్యంగా ప్రాచీన సాహిత్యంలో కవులు రాసే సాహిత్యాన్ని కళాత్మకంగా ఉండడానికి సందర్భోచితంగా ఛంధస్సును, అలంకారాలను అద్దుతూ రసరమ్యంగా తీర్చిదిద్దుతారు.

ఇక్కడ కుందుర్తి తెలంగాణ సంస్థానంలోని ప్రజల స్థితిగతులను కూడా ఎంతో చక్కని సాహిత్య మెళకువలతో చమత్కారంగా తీర్చిదిద్దారు. అంటే తెలంగాణలో మూడు శతాబ్దాల పరిపాలన జరిగిందని, ఆ పాలన అంతా అపశబ్ధాలే అని పేర్కొంటారు.

ఉదా॥ ఆ సంస్థానంలో నాగరికత కల్పతరువు అమోఘంగా ఉన్నట్లు ప్రచారం చేస్తూ ప్రజలను భ్రమలో ముంచారు. మంచి సుపరిపాలన కొనసాగుతుందనే వాదాన్ని తీసుకువచ్చారు. అవి ఎలా ఉన్నాయంటే `

"నవాబుగారి దర్బారులో ఆస్థానకవి రేడియోగారు
బీరు పోలేదలంకారాలు యీ విశాల ధరిత్రిలో
వారు వడనివి లేవు సాహిత్య చరిత్రలో"

అంటే అంతా అద్భుతం జరుగుతోందని వందలాది కవులు అనేక వైవిధ్యంతో కూడిన రచనలు చేసినట్టే వాఖ్యాలు చేస్తూ ప్రజలను తప్పుదారి పట్టించారిన కుందుర్తి నినాదించారు.

ఈ ప్రచారం ఎలా ఉందంటే ఒక చిన్న విషయం, పది కావ్యాలుగా, అలాగే ఒక బావి నీరే కాలువల్లో పారినట్లుగా చిన్న చిన్న విషయాలను పదిరకాలుగా బాకాలుగా ఊది ప్రజలను వంచించారు అని పేర్కొన్నారు.

ఇంకా ఆ ప్రచారాలలో ఉపమానాలు, ఉత్ప్రేక్షలు, సహజోక్తులు, అతిశయోక్తులు మొదలైనవి ఎలా ఉన్నాయంటే, మన ప్రాచీన సాహిత్యంలో ప్రబంధ కవులు తమ రచనలను అనేక వర్ణనలో ఒక చిన్న అంశాన్ని పుంఖాను పుంఖాలుగా రాసేవారు. అలాగే మరి ఈ రాజుగారి ధర్బారులోని రేడియో ఆ ప్రబంధ కవులను మించి ప్రచారం చేసుకుని పాలన ఎంతో అద్భుతంగా కొనసాగుతోందని మోసపు ప్రచారం చేసుకున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే దేశానికి మోసం చెల్లించిన మూల్యంగా హైదరాబాద్ సంస్థానం నిలిచిందని స్పష్టం చేశారు. ప్రజలు నిలదొక్కుకునేందుకు చేసిన సహకారానికి, ఒక జానెడు నేల ప్రతిఫలంగా దక్కిందా సింహాసనం. ఇంకా చెప్పాలంటే ద్రోహానికి ప్రతిఫలంగా దొరికిన ఆ సింహాసనం. ఎండాకాలమే వసంతకాలమంటే ఏలినవారు అబద్ధం ఆడరని ప్రజలు అమాయకంగా నమ్మి ప్రభుత్వం మీద ఎంతో భక్తితో ఉన్నారు.

> ఇంకా ఆ ప్రచారాలలో ఉపమానాలు, ఉత్ప్రేక్షలు, సహజోక్తులు, అతిశయోక్తులు మొదలైనవి ఎలా ఉన్నాయంటే,

ఇలా మూడు శతాబ్దాల పరిపాలన అంతా అపశబ్దాల పరంపరంగానే సాగిందని, అయితే క్రమక్రమంగా ప్రజల్లో చైతన్యం వెల్లుబికి ఆ ప్రభుత్వాన్ని ఎదుర్కొని నిలబడి, నిరసించి, అనేక సంఘర్షణలు పడి, ప్రాణాలు సైతం పణంగా పెట్టి పోరాడి చివరకు విజయం సాధించారు అని ఆ హైదరాబాద్ సంస్థానంలో జరిగిన అక్రమాలను, అన్యాయాలను ప్రజలు తెలుసుకుని అనేక తిరుగుబాట్లు చేశారని ఈ కవితను ఇలా పూర్తిచేశారు.

"ఈ మూడు శతాబ్దాలు మీటిన పరిపాలన వీణలు
పలికినవి అపశబ్దాల పరంపరాల బాణులు
క్రమక్రమానుగత చైతన్య ధనుష్ప్రాణులు
ప్రజలు నేడు
సమాజ సమిష్టి ప్రయోజన నిశిత బాణులు
ప్రజలు నేడు"

హైదరాబాద్ సంస్థానంలో జరిగే మోసాలను గుర్తించి ప్రజలు ఎగురవేసిన తిరుగుబాటు ధోరణలను వివరిస్తూ ఇంకా ఈ సింహాసన ఎలాంటిదంటే....

"ఆచంద్ర తారార్కం చరిత్రలో పేరు నల్లగా
నీచపు ద్రోహిగా
వ్రాయించుకొను చేసుకున్న నిర్ణయం
తెచ్చి పెట్టిన సింహాసన మది"

అని చరిత్ర గతిలో హైదరాబాద్ సంస్థానంలో జరిగిన సంఘటనలను తెలియజేస్తే ఆ ప్రభావంతో ప్రజలు క్రమక్రమంగా చైతన్యవంతులుగా మారి చివరకు విజయం సాధించారు అని ఈ సింహాసన ఖండిక ద్వారా సాహిత్యాంశాలతో పాటు, చారిత్రకాంశాలను కూడా తన రచనలో పొందు పరిచి విలక్షణమైన సాహిత్య సృష్టి చేసినందువలనే సాహిత్య చరిత్రలో తనకంటూ ప్రత్యేక స్థానాన్ని కలిగి ఉన్నారు.

ఇలా అటు సాహిత్యానికి, ఇటు సమాజానికి ఎంతో చైతన్యాన్ని కలిగించిన కుందుర్తి అస్వస్థతతో 1982లో భౌతికంగా ప్రపంచానికి దూరం అయ్యారు.



# తెలుగు పద్యామృతం



డాక్టర్ ఎన్. సి. హెచ్. చక్రవర్తి
✆ 93999 58069



పోతన భాగవతానికి తెలుగు సాహిత్యంలో ఉన్న ప్రశస్తి గొప్పది. అందులో ఒక పద్యాన్ని చూద్దాం.

శా.

బాలుండీతడు,కొండ దొడ్డది,మహా భారంబు సైరింపగాఁ
జాలండో? యని దీనిక్రింద నిలువన్ శంకింపగా బోల, దీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరా చక్రంబు పై పడ్డ నా
కేలల్లాడదు, బంధులార! నిలుడీ క్రిందం బ్రమోదంబునన్(1)



కృష్ణుడు గోవర్ధనగిరిని ఎత్తి గోప కులాన్ని కాపాడే సందర్భం. 'పర్వతాన్ని ఎత్తి పట్టుకుంటానంటున్నాడు. అందునా ఒంటి వ్రేలిపై నిలుపుతాను అంటున్నాడు. పైగా ఇతడు చిన్న వయస్సులో ఉన్నాడు. ఈ కొండ కింద ఉంటే ప్రాణాలు నిలుస్తాయా? 'అని సందేహంలో ఉన్నారు గోపులు అందరూ.

అప్పుడు జగద్రక్షకుడైన కృష్ణుని మాటలు పై పద్యం.

సహజమైన సంభాషణ. తేట తెలుగు మాటలు. ఆ మాటల్లో కృష్ణుని ఆత్మవిశ్వాసం అక్కడున్న వారిలో ధైర్యం నింపాలి. ఎలాంటి ధైర్యం?? తమ ప్రాణాలు కాపాడబడతాయని విశ్వాసంతో వారంతా ఆ కొండ క్రిందకు వచ్చి ధైర్యంగా ఉండాలి. ఆ మాటలు అంత శక్తిమంతాలు.

కృష్ణుడు అంటున్నాడు:

బంధులార! = ఓ బంధువులారా!

బాలుండీతడు =ఇతడు బాలుడు అనుకోకండి.

కొండ దొడ్డది =ఈ కొండా?పెద్దది.(గోవర్ధనగిరి)

మహా భారంబు సైరింపగాఁజాలండో=ఇంత భారాన్ని మోయగలగుతాడా??

అని దీనిక్రింద నిలువన్ శంకింపగాఁ బోలదు=అనే సందేహంతో ఈ కొండక్రింద నిలువడానికి సందేహించవద్దు.

ఈ శైలాంభోనిధి జంతు సంయుత ధరాచక్రంబు=ఈ పర్వతాలు, సముద్రాలు, సమస్త ప్రాణులతో నిండియున్న భూమి,

పై పడ్డన్ =పైన పడినా

నా కేలు అల్లాడదు=నా చెయ్యి కదలను కూడా కదలదు.

ప్రమోదంబునన్ =సంతోషంగా(నిర్భయంగా)

ఈ క్రిందన్ నిలుడు = ఈ కొండ క్రిందకు రండి.

మొత్తం భూమి నాపై పడినా నా చెయ్యి కనీసం కదలను కూడా కదలదు అన్న కృష్ణుని మాటల్లో ఉన్న ఆత్మ విశ్వాసమే గోపకులంలో ధైర్యం నింపడానికి కారణం అయింది. పైగా సంతోషంగా వచ్చి ఉండండి అనడం కూడా వారికి మరింత ధైర్యాన్ని ఇచ్చింది. నన్ను పిల్లాడు అనుకుంటున్నారేమో అనడంలో జగద్రక్షక దక్షతాధ్వని ఉంది. ఈ ఒక్క పద్యం ఈ ఘట్టంలో

ముఖ్యమై, కృష్ణుని ఒక లీలావిలాసం ఆవిష్కరించడానికి దోహదం అయింది.



ఆధునిక కవులలో అగ్రశ్రేణిలో నిలిచే కవి దాశరథి కృష్ణమాచార్యులు గారు. ప్రజాకవి. కళాప్రపూర్ణులు. వారి కలానికి కాలాన్ని ఎదిరించి నిలిచే శక్తి ఉంది. వారి 'తామసి' అనే కవితా ఖండికలోని ఒక చిన్నపద్యాన్ని ఆస్వాదిద్దాం.

ఆవె.

ఇరులకన్న నంద మెచటఁ గానగరాదు

ఇరులె సౌఖ్యములకు దరులు సుమ్ము

ఇరులు లేనినాడు నరులు కానగరారు

నరులు లేనినాడు ధరణి లేదు(2)

అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః కావ్యం అనేది ఒక సృష్టి. ఆ సృష్టి చేసే బ్రహ్మ కవి. తాను దేన్ని వర్ణించదలచాడో దానినే ఉత్కృష్టంగా వర్ణిస్తాడు. అదే కవి నైపుణ్యం. ఈ వర్ణనా చాతుర్యమే సాహిత్యలోకంలో కవి స్థానాన్ని నిర్ణయిస్తుంది. ఇక్కడ దాశరథి వర్ణ్య వస్తువు చీకటి. కనుక చీకటి మహత్త్వవర్ణన. సాధారణంగా లోకులను భయపెట్టే చీకటి కవి చేతిలో నాయిక అయి, మనోహరత్వాన్ని సంతరించుకుంది.

ఇరులకన్న నంద మెచట కానగరాదు =చీకట్లను మించిన అందాలు ఎక్కడా కనపడవు.

ఇరులె సౌఖ్యములకు దరులు సుమ్ము =చీకట్లే సర్వ సుఖాల తీరాలు.

ఇరులు లేనినాడు నరులు కానగరారు=చీకట్లు లేకుంటే అసలు నరులే లేరు.

నరులు లేనినాడు ధరణి లేదు=మానవులు లేకుండా ధరణి ఏ లేదు.

చీకట్లే నరావిర్భావానికి కారణం అన్న కవి మాటలు సత్యావిష్కారకాలు.

సౌఖ్యాలదరులు కనుకనే సమాజ ఆవిర్భావానికి కారకాలు అన్నది అందమైన ధ్వని. ఆధునిక సాహిత్యంలో ప్రకృతి వర్ణనలో తామసీ వర్ణన ఒక చెప్పుకోదగ్గ ఘట్టం.

★

శతకసాహిత్యానికి వస్తే ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకం పేరెన్నికగన్నది. అందులోని ఒక పద్యం పరిశీలిద్దాం.

మ.

జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచాబంధముల్ వాద్యముల్
కలశబ్దధ్వనులంచితాంబరమలంకారంబు దీప్తుల్ మెరుం
గులు నైవేద్యము మాధురీ మహిమగా గొల్తున్ నినున్ భక్తి రం
జిల దివ్యార్చనగూర్చి నేర్చిన క్రియన్ శ్రీకాళహస్తీశ్వరా!(3)

శివుడే సర్వస్వం అయిన కవిగా ధూర్జటి మహాదేవునకు ఇలా నివేదించుకుంటున్నాడు.

శ్రీ కాళహస్తీశ్వరా!= శ్రీ కాళహస్తీశ్వరా!
రసముల్ జలకంబుల్ = కావ్యాల్లో ఉండే రసాలే జలాభిషకాలు.
వాచా బంధముల్ ప్రసూనములు=పదబంధాలే పూవులు.
కలశబ్దధ్వనులు వాద్యములు=శబ్ద ధ్వన్యాదులు వాద్యాలు.
అంచితాంబరము అలంకారంబు=అలంకారాలే పట్టు వస్త్రాలు.
మెరుంగుల్ దీప్తుల్=కవితల్లోని గుణాదులు దీపాలు
మాధురీమహిమ నైవేద్యము=కవితల్లోని మాధుర్యాదులే నైవేద్యాలు.
దివ్యార్చన గూర్చి=దివ్యమైన అర్చనగా
నేర్చిన క్రియన్=నీకు తెలిసిన రీతిలో
భక్తి రంజిలన్=భక్తి మీరగా
కొల్తున్=నిన్ను సేవిస్తాను.

కవికున్న ఆస్తి కవిత్వం. అందులో రసాలంకార ధ్వన్యాదులు పూజా ద్రవ్యాలు. అందుకే కవి ఆ సామాగ్రితోనే దైవాన్ని కొలుస్తానని

విన్నవించుకున్నాడు. అందరూ బంగారు ఆభరణాలతో పూజలు చెయ్యలేరు. దైవాన్ని అర్చించడానికి ఆడంబరాలు అవసరం లేదు. ఉన్నవాటితోనే ఆరాధించాలి అని ధూర్జటి సూచన చేసాడు ఈ పద్యంలో.



ఈ వ్యాస రచయిత అయిన డాక్టర్ చక్రవర్తి రచన 'శతకవనం' లోని ఒక పద్యం చూడండి:

తేగీ.

బొగ్గులోనుండి పుట్టిన యగ్గి యెరుపు,<br>
మంటపొగనల్పు, పుట్టు భస్మమ్ము దెలుపు,<br>
రంగులన్నింటి యాత్మమూలమ్మొకండె,<br>
యెదను గదలించుమాట జెప్పెదను వినుడు.(4)

భావం: బొగ్గు నల్లగా ఉంటుంది.బొగ్గులోనుండి పుట్టిన మంట ఎరుపు.ఆ మంటనుండి వచ్చే పొగ నలుపు. ఆ పై వచ్చే భస్మం తెలుపు. ఇలా ఉన్న రంగులు అన్నిటికీ మూలం ఒకటే. అలాగే అన్నిటికీ మూలం దైవమే.

వర్ణభేదాలతో మనుష్యులు ఘర్షణలు పడడం అవివేకం అని కవి సందేశం.

సూచికలు;


1. బాలసరస్వతి బుక్ డిపో కర్నూలు,మద్రాసు వారి ప్రచురణ 1964. పోతన శ్రీమహాభాగవతం దశమ స్కంధము. పద్యం 920.
2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ 2010.ప్రజాకవి దాశరథి సాహిత్యం -1. తామసి పద్య ఖండిక.
3. విక్టరీ పబ్లిషర్స్ విజయవాడ వారి ప్రచురణ 2008.శ్రీ కాళహస్తీశ్వర శతకం పద్యం 49.
4. భావనాప్రియ సాహిత్య బృందం 2022 ప్రచురణ. కవి NCh. చక్రవర్తి. శతకవనం (సామాజిక శతకం). పద్యం 74.




# భయం



డాక్టర్ వి.ఆర్.రాసాని
98484 43610





పున్నమిరాత్రి నిండు చంద్రుణ్ణి పట్టుకొని
వెన్నెల తేనీటిని వంచుకొని తాగేయాలని వుంది

చీకటి కళ్లంలో జారిపోయిన
తారల గింజల్ని ఏరి ఏరి
ఉడ్డపెట్టి, ముత్యాల మాలల్లాకట్టి
నా ఇంటి గోడలకీ, గుమ్మానికీ వ్రేలాడదీయాలనివుంది

నాకే గనక రెక్కలొస్తే, ఆకాశంలోకెగిరి
పంచరంగుల సీతాకోకలతో విహరించి
రామచిలుకలతో ఖగభాషలో ఊసులాడి ఆనందించి
హాయిగా తిరిగి రావాలనివుంది



మధురంగాకూసే కోకిల పాటగా
పురివిప్పి ఆడే నెమళ్ల నాట్యంగా మారి
ఆడి, పాడి, అలసి సొలసిపోవాలని వుంది
మేఘాల గాలిపటాల మధ్యన కూర్చొని
ఆకాశమంతా తిరిగి ప్రకృతి అందాలను
వీక్షించి తరించి పోవాలనివుంది





ప్రాక్పొయ్యి మీద కొండల రాళ్ల మధ్యన
ఎర్రగా మండే సూర్యుని మంటలపైన
క్షీరఘటాన్నికాచి, తోడుపెట్టి
కొండకవ్వాన్నేసి చిలికిచిలికి
అందులోనే తెల్లటి వెన్నముద్దనై తేలిపోవాలని వుంది



ఇంకా...ఏమేమోచేసి చేసి
పరవసించి నిలువునా కరిగిపోవాలని వుంది
కానీ.... అవకాశమేదీ?

వైరస్ వైరిమూకలు మేనికోటలోకి దూకి
రక్తపుచుక్కల్ని పీల్చేస్తాయనీ, కరోనా కర్కోటకులు కసితో
కాటేసి కాలకూట విషంతో చంపేస్తారనీ
ఒకటే... భయం-భయం





Democracy is not merely a form of Government.

It is primarily a mode of associated living, of conjoint communicated experience.

It is essentially an attitude of respect and reverence towards our fellow men.

**- B. R. Ambedkar**

శాస్త్ర ప్రకాశిక

# 2022 నోబెల్ విజేత కెరొలిన్. ఆర్. బెర్టోజ్ పరిశోధన: పరిచయం



డాక్టర్ చాగంటి కృష్ణ కుమారి
✆ 98851 63304



రాయల్ స్వీడిష్ అకాడమి ఆఫ్ సైన్సె స్ 2022 రసాయన శాస్త్ర విభాగంలో నోబెల్ బహుమానం స్టాన్ఫర్డ్ యూనివర్సిటికి చెందిన కెరొలిన్. ఆర్.బెర్టోజ్, కోపెన్ హాగెన్ యూనివర్సిటికి చెందిన మోర్టె మెల్డాల్, యు. ఎస్. స్క్రిప్ రీసెర్చ్ కి చెందిన కె.బి .షార్ప్ లెస్ లకు ప్రకటించింది. క్లిక్ కెమిస్ట్రి, బై -ఓ -ఆర్థో – గోనల్ కెమిస్ట్రి ల అభివృదికై ఈ ముగ్గూరూ చేసిన కృషికి గుర్తింపుగా ఒకొక్కరూ నోబెల్ పురస్కారంలో మూడవ వంతు భాగాన్ని పొందారు.



కెరొలిన్. ఆర్.బెర్టోజ్ రసాయనశాస్త్రంలో నోబెల్ ని పొందిన 8వ వనిత. అదివరలో 2020లో ఇద్దరు వనితలు, 2018, 2009, 1964 , 1935, 1911 ల లో ఒక వనిత చొప్పున ఈ బహుమానాన్ని అందుకొన్నారు.

కెరొలిన్. ఆర్.బెర్టోజ్ నిర్వహించిన పరిశోధన ఏమిటో కొద్దిగానైనా తెలిసికోవాలనుకొంటే ముందు మనము క్లిక్ కెమిస్ట్రీ , బయో ఆర్థోగోనల్ కెమిస్ట్రీ లు అంటే ఏమిటో కాస్తగానైనా తెలుసుకోక తప్పదు!

**క్లిక్ కెమిస్ట్రీ:** సహజమైన రసాయన అణువులలోనే మార్పులూ చేర్పులూ చేస్తూ తమకు కావలసిన ఔషధీయ ధర్మాలతో వాటిని పున:సృష్టించేందుకు పరిశోధనలు చేస్తూ ఆశించిన ఫలితాలను పొంద చూసేవి సాంప్రదాయ పరిశోధనలు.ఈ విధానంలో చేసే ఔషధ ఆవిష్కరణలు నిదానంగా జరుగుతాయి: ఖర్చు ఎక్కువ; పరిశోధకుడు

బాగా యాతన పడవలసి వుంటుంది.



అలా కాకుండా,సులభంగా,మామూలుగా లభించే ప్రారంభ రసాయన కారకాలతో, సరళంగా జరపగలిగే రసాయన చర్యలను నిర్వహించే, క్రమ నిర్మాణ జాలక పద్ధతిలో, విస్తృతాన్వయాలకు అవకాశాలను కల్పించగల రసాయన శాస్త్రం క్లిక్ కెమిష్ట్రి. ఈ పద్ధతిలో వాడవలసిన చర్యా పరిస్థితులు సరళమైనవి. వేగవంతమైనవి. నీరు వంటి విష స్వభావాలు లేని ద్రావణులలోనే చర్యలను నిర్వహించడానికి వీలున్నవి. వేర్పాటు పద్ధతులు (separation methods) కూడా బహు సరళమైనవి . దిగుబడి అధికము. క్లిక్ కెమిష్ట్రి హరితరసాయన శాస్త్ర నియమాలకు ఒడబడి వుంటుంది. ప్రస్తుత మన పరిసర, వాతావరణ స్థితి గతులరీత్యా ఏపరిశోధన అయినా హరితరసాయన శాస్త్ర నియమాలకు ఒడబడి వుండక తప్పదు. ఈ పద్ధతి చర్యలకు క్లిక్ కెమిస్ట్రీ పదాన్ని వాడుతూ అమెరికన్ శాస్త్ర వేత్త కె బి. షార్ప్ లెస్.1999లో అమెరికన్ సొసైటివారి 217వ వార్షిక సమావేశం లో ప్రకటించాడు. కె .బి. షార్ప్ లెస్,అతనితో కలసి పనిచేసిన పరిశోధకులు క్లిక్ కెమిష్ట్రి పద్ధతుల ఆరంభకులు. తొలిసారిగా కైరాల్ ఉత్ప్రేరకాలను (Chiral Catalysts) అభివృద్ధి చేసినందుకుగానూ షార్ప్ లెస్ 2001లో రసాయనశాస్త్ర విభాగంలోనే మూడవవంతు నోబెల్ బహుమానాన్ని అందుకొన్నాడు.ఇప్పుడిది అతనికి రెండవసారి లభించిన బహుమానము.



క్లిక్ కెమిస్ట్రీ ని కొక్కెపు కూర్పు రసాయన శాస్త్రం అందాం. ఎందుకంటే అది కేవలము రెండు అణువులలో అటూ ఇటూ సులభంగా కలిసిపోగల కొనలను కలపుతూ సరికొత్త అణువులను రూపొందించడమే కనక!



ఎలాగంటారా! పటాన్ని చూస్తే మీకు ఆ సంగతేమిటో సులభంగా తెలిసిపోతుంది .అయితే రెండు కొక్కాలూ కలిసి పోగల నిర్మాణంలో ఆరెండు అణువులకు ఒకానొక దగ్గర కొసలు వుండాలి.ఈ విధంగా సరళమైన అణువులతో ఎంతో క్లిష్టమైన నిర్మాణంగల అతి పెద్ద ఔషధ అణువును రూపొందించవచ్చు. పరిశోధకుడు ఆశించిన,లేదాకోరిన విధాన కలపగలిగే నిర్మాణ యూనిట్ లున్న అణువులు దొరికాయా, వాటిని కలుపుతూ కేవలం కొన్నిస్పుటమైన దశలలోనే అసంఖ్యాకంగా సరికొత్త అణువులను రూపొందించ గలడు.రెండు అణువులలో స్వభావజనిత, అంతర్గతంగా బంధ మేర్పరచు కోవాలన్న చోదనమున్నప్పుడు అటువంటి అణువుల మధ్య సులువుగా, వేగంగా భందమేర్పడిపోతుంది.పైపెచ్చు అనవసరమైన ఉపఉత్పన్నాలు(by-products) ఏర్పడడానికి అవకాశమే లేదు. ఇదే కొక్కెపు కూర్పులో రసాయనికులు పన్నిన యుక్తి.

అణువులను కొక్కేలతో కూర్చుతూ కొత్త అణువును ఏర్పరచే చర్యకు తొలిచర్య గా కాపర్(Cu) ఉత్ప్రేరక సమక్షంలో ఎజైడ్ లు ఆల్కైన్ లతో కలవడాన్ని చెపుతారు.ఈ రెండూ కలవగా స్థిరమైన చక్రీయ నిర్మాణంగల ట్రైఎజోల్ ఏర్పడింది. ఈచర్యను మెల్డాల్, షార్ప్ లెస్ లు ఎవరికి వారుగా 2000 సంవత్సరంలో కనుగొన్నారు. కొక్కెపుకూర్పు రసాయనికశాస్త్రానికి ఈ చక్రీయ సంకలనచర్య తలమానికంగా నిలిచింది.ఈ చర్యా విధానాన్ని పటంలో చూడవచ్చు.




ఎజైడ్ ఒక నైట్రైడ్ అయాను( −N=N +=N −.) గల ఒకానొక కర్బన సమ్మేళనము, కార్బన్ కీ కార్బన్ కీ మధ్య కనీసం ఒక త్రికబంధమున్న( ) హైడ్రో కార్బను ఆల్కైన్ .




ఈవిధముగానున్న కర్బన సమ్మేళనపు రెండు అణువుల మధ్య సులువుగా పటంలో మీరు చూసినట్టుగా బంధమేర్పడి చక్రీయ నిర్మాణం గల కొత్త పదార్థం (ట్రైఎజోల్) ఏర్పడుతుంది. చక్రీయ నిర్మాణం లోనున్న ట్రైఎజోల్ ఔషధాల, వర్ణదాల, వ్యవసాయసంబంధ రసాయనాల తయారీకి కట్టుడు ఇటెకె వంటిది. సాంప్రదాయచర్యలో అధికఉష్ణోగ్రతల దగ్గర రోల్ఫ్ హర్జన్ గారు నిర్వహించిన చర్య చాలా నెమ్మదిగా జరుగు తుంది. మెల్డాల్, షార్ప్ లెస్ లు కాపర్ ఆయానులను ప్రవేశపెట్టడంద్వారా చర్య వేగవంతమయింది. పటములో రెండు చర్యలను చూడవచ్చు. ప్రస్తుత కాలంలో ఈ చర్య ఔషధాల రూపకల్పనలలో, DNA పటాలను పొందడంలో, సరికొత్త పదార్థాల తయారీలో విరివిగా వాడుకలో వుంది.

**బయోఆర్థొగోనల్ కెమిస్ట్రీ :** 2003లో బయోఆర్థొగోనల్ కెమిస్ట్రీ ని కెరొలిన్. ఆర్.బెర్టోజ్, కనుగొంది. ఈ పదాన్ని కూడా ఆమే సూచించింది. దీనిని మనం లంబ కోణీయ జీవ రసాయనశాస్త్రం, సరికోణీయ జీవ రసాయనశాస్త్రం అని కూడా అనవచ్చు. ఎందుకంటే ఆర్థొగన్ అనగా అన్నీ సరికోణములేఉన్న ఆకృతి. ఈ అకృతిలో కోణాలన్నీ లంబకోణాలే! లంబ కోణీయ జీవ రసాయన చర్యలు జీవ కణాల జోలికి వెళ్లకుండా, అనగా జీవ కణాల సహజమైన రసాయన ప్రవర్తనకు, వాటి చర్యలకు భంగం వాటిల్లని విధాన జివరాశుల లోపల జరపగల, రసాయన చర్యలు. పరిశోధకుడు జీవిలోపల ప్రవేశపెట్టిన రసాయనాలు జీవకణాలతో అన్యోన్య చర్యలు (interactions) జరపవు. ఎలాగంటే ఇవి జరుగుతున్న పథం వేరు, అవి జరిగే పథంవేరు. మాకు మేమే, మీకు మీరే — గా— ఒంటిపిల్లి రాకాశిగా-- అన్నమాట! ఈ


© Johan Jarnestad/The Royal Swedish Academy of Sciences

రసాయనశాస్త్రపు పునాదులు బౌతిక, కర్బన రసాయన శాస్త్ర సూత్రాలలో (physical organic chemistry)వున్నాయి. కెరొలిన్. ఆర్.బెర్టోజ్ కొక్కెపు కూర్పు రసాయనశాస్త్రాన్ని లంబకోణీయ జీవ రసాయన శాస్త్రంతో అనుసంధానం చేసింది. ఇది ఒక నూతన సాంకేతిక విధానము. రసాయనప్రయోగశాలలలో చేసే చర్యలతో పోలిస్తే జీవరసాయనచర్యలు అత్యంత క్లిష్టమైనవి. జీవిలోపల, అక్కడవుండే పరిసరాలలో ( జీవ మాధ్యమంలో) రసాయన చర్యలను నిర్వహించడం చాలా కష్టము. అయినప్పటికీ జీవరాశులలో రసాయన చర్యలు జరిగే క్రియాశీలక ప్రదేశము ఒకచోట వుంటుంది. దినికి ఎల్లలున్నాయి. దీనికి వెలుపల ఒకచోట లంబకోణీయ జీవరసాయనశాస్త్ర చర్యల క్రియాశీల ప్రదేశముంటుంది. ఇవి రెండు వేరువేరు పాలపుంతలని బెర్టోజ్ తన నోబెల్ పురస్కార ఉపన్యాసంలో వర్ణిస్తూ చిత్రాన్ని




చూపుతూ వివరించింది. ఆమె కాన్సర్ తో పోరాడగల కొక్కెపుకూర్పు చర్యలను కనుగొనగలిగింది. రసాయనశాస్త్రం, ఇంజనీరింగు, వైద్యశాస్త్రాలను మూడిటినీ కలిపే వంతెనను నిర్మించగలిగింది. అదెలాగో చూద్దాం.

బెర్టోజ్కి గ్లైకాన్ లపట్ల ఆసక్తి ఎక్కువ . ఇవి DNA, న్యూక్లిక్ ఆమ్లాలు, ప్రోటీనుల లాగే జీవరాశులకు నిర్మాణ ఇటుకలవంటివి. ఇవి చక్కెరలు. చాలా జీవరాశులలో గ్లోకోజు, ఫ్రక్టోజు, గాలక్టోజులు శక్తినిచ్చే కార్బో హైడ్రేటులు. ఇవేకాక చాలాసంక్లిష్టమైన మోనో శాకరైడులు (చక్కెరలు) పొడుగాటి గొలుసులుగా, ఆగొలుసులకు శాఖలుతో కూడిన బృహదణువులు (polymers) కూడా వున్నాయి. అటువంటి చక్కెరలు గ్లైకానులు( చూడు పటము). బెర్టోజ్ పరిశోధన మొదలుపెట్టిన నాటికి వీటి గురించిన సమాచారము చాల తక్కువ. వీటిని ప్రయోగశాలలో తయారుచేయడం కష్టం. వాటిని విశ్లేషించడమూ కష్టమే! వీటి నిర్మాణం, ప్రవర్తనాతీరుల అవగాహనకై




Glucose



Sucrose



Starch



N-glycan

కొన్ని సంవత్సరాల పరిశోధనలను నిర్వహించిన మీదట ఆమెకు ఒక ఊహ తట్టింది. వీటికి స్ఫుర దీప్తి చీటిని తగిలిస్తే (fluorescent tag) జీవకణాలలో ఈ గ్లైకానులెక్కడ వున్నాయో చూడగలం కదా! చీటీ అతికించడం ఏమంత కష్టంకాదు గానీ, ఆచీటీ ఇటు గ్లైకాన్ చక్కెరతో కానీ, అటు జీవ కణాలతో కానీ అన్యోన్యచర్యలు జరపడానికి ఎంతమాత్రమూ సిద్ధపడకూడదు. గ్లైకాన్కి సరిపడే ఆ ఫలానా స్ఫురదీప్తి రసాయనం ఏదో దానినే ఎంపిక చేసి వాడాలి( selective). ఈ చీటీ జీవకణాల పనిని ఆటంక పరచకూడదు. వాటిపనిని అవి చేసుకొని పోనివ్వా లి. అంతేనా అతికించిన చీటీ విషం కాకూడదు.అదికదా అసలు సమస్య!.



బెర్టోజ్ , ఆమె సహచరులు చాల రకాలుగా చర్యలు చాలామార్లు నిర్వహించి చూసారు. చిట్టచివరకు వంద సంవత్సరాల నాటి స్టాడింగార్ చర్య గుర్తుకొచ్చింది . దానిని తమ పరిశోధనకు అవసరమైన మార్పులతో ప్రవేశపెట్టారు. ఇప్పుడిది స్టాడింగార్ బెర్టోజ్ లైగేషన్ చర్యగా

పేరు పొందింది. దీనివల్ల వారు బయోఆర్థొగోనల్ గానే ప్రత్యేకరీతిలో మార్చిన చక్కెర అణువుకి ప్రతిదీప్తి చీటిని అతికించి జీవ కణాలలో ప్రవేశపెట్టగలిగారు. ఈ విధంగా వీరి పరిశోధన వల్ల జీవకణాల ఉపరితలాలపై చక్కెరలు ఎలా వితరణ (distribute) చెంది వున్నయో రసాయనికులు చూడగలిగారు. జీవులలోజరిగే ఊహకందని , సంక్లిష్టమైన జీవరసాయన చర్యలను యదార్ధ స్థితిలోనే రసాయనికులు అధ్యయనం చేయగలగడానికి మార్గం వేసిన ఘనత ఈమెకు దక్కింది.

సరే, ఇక చర్యను జీవి శరీరంలో నిర్వహించాలికదా! అందుకామె మెల్డాల్, షార్ప్ లెస్ లు కనుగొన్న కొక్కెపు రసాయనచర్య యుక్తిని వాడింది. అయితే వారి చర్యావిధానాన్ని యధాతథంగా వాడుకోడానికి వీలులేదు. ఎందుకంటే వారు కాపర్ ని ఉత్ప్రేరకంగా వాడి చర్య వేగాన్ని పెంచారు. జీవరాశులకు కాపర్ విషతుల్యము. దానిని వాడడం కుదరదు. తన పరిశోధనాబృదం తో కలసి లంబకోణీయ జీవచర్యలను, వాటి ఉత్పన్నాలనూ అధ్యయనం చేయడం ద్వారా కణాలు ప్రోటీనులను, ఇతరాణువులనూ ఎలా తయారుచేసుకొంటాయో అవగాహనకు వచ్చిన పిమ్మట, కేన్సర్ కు సరికొత్త మందులను అభివృద్ధి చేయాలన్నదే బెర్టోజ్ లక్ష్యం. అంతేకాదు, శక్తి నిలువకు పనికివచ్చే కొత్త పదార్థాలను తయారుచేయడం, అటువంటివే ఇంకనూ ఇతర అనువర్తనాలను కూడా సాధించాలన్న సంగతికి కూడా ఈ చర్యలను నిర్వహించాలి అన్నదే వారి ఈ పరిశోధనల దృష్టి కోణము.

మొత్తానికి తనకు కావలసిన తీరులోనే కాపర్ ని వాడకుండా మెల్డాల్, షార్ప్ లెస్ పరిశోధనాఫలితాలనే వాడుకొంటూ సమర్ధవంతమైన, కొంగ్రొత్త కల్పనతో జీవరాశులలోని గ్లైకానుల చిత్రపటాలను తయారుచేసింది.

గ్లైకానులు అనగా కార్బోహైడ్రేటుల ప్రాతిపదికలుగా జీవరాశులు తయారుచేసుకొనే బృహదణువులని (పాలిమర్లు) ఇదివరలో చెప్పుకొన్నాము.

బెర్టోజ్ ప్రధానంగా కేన్సర్ గడ్డ ఉపరితలముపై నున్న గ్లైకానుల అధ్యయనం పైన తన దృష్టిని కేంద్రీకరించింది. శరీరపు రోగనిరోధక వ్యవస్థలోగల గ్లైకానులే కాన్సర్ కంతులపై చేరి వాటికి రక్షణ నిస్తున్నట్టుగా ఆమెకు తెలియ వచ్చింది. దాని ఫలితంగా శరీరపు రోగనిరోధక వ్యవస్థ పనిచేయలేదు. ఈ గ్లైకానుల రక్షణ చర్యావిధానాన్ని

అడ్డుకోడానికి బెర్టోజ్ ఆమె బృందం ఒక సరికొత్త జీవ ఔషధాన్ని ప్రవేశపెట్టారు. గ్లైకాన్లకే ప్రత్యేకించి ఒక ప్రతి రక్షకాన్ని(glycan-specific antibody)ఎంజైముకి తగిలించారు. ఇది కాన్సర్ గడ్డపైనున్న గ్లైకానులను విచ్ఛేధనం చెందించింది. ప్రస్థుతము ఈ విధానం చికిత్సా రంగంలో బాగా ముదిరిన కేన్సర్ రోగుల పై ప్రయోగించి చూసే దశలో వుంది. ఈ పద్దతి జీవకణాల సహజ రసాయనపనితీరును ప్రభావితం చేయదు. బెర్టోజ్ తన పరిశోధనలను ఎలుకలు, జీబ్రా చేపలపై నిర్వహించింది.

ఈ విధానాన్ని నానో టెక్నాలజీ తో అనుసంధానం చేసిన రోజున, ఇంకను జీవ ఔషధాలు విస్తృతంగా పలు విభాగాలలో తయారై రాణింపు పొందడం, జీవాణువుల చిత్రాలను తీయడం(molecular bioimaging) గురిపెట్టి ఎక్కడకు మందును చొప్పించాలో అక్కడకే నేరుగా చొప్పించగలగడం(targeted delivery), మందు ఎక్కడ పనిచేయాలో సరిగ్గా అక్కడే --- ఆఫలానా- స్థానం--దగ్గరే పనిచేసేలా చేయగలగడం,( in situ drug activation) కణాలు- నానో పదార్థాల అన్యోన్య చర్యలు (cell-nanomaterial interactions) మొదలైన రంగాలు అభివృద్ధి చెందుతాయి.

కెరొలిన్. ఆర్.బెర్టోజ్ కు జేజే లు.

## సంప్రదింపులు( references)


1. https://chemistry.stanford.edu/people/carolyn-bertozzi
2. https://www.nobelprize.org/prizes/chemistry/2022/summary/
3. https://www.nobelprize.org/prizes/chemistry/2022/bertozzi/lecture/
4. Introduction: Click Chemistry. Chemical reviews ASC https://pubs.acs.org/doi/10.1021/acs.chemrev.1c00469
5. The National Inventors Hall of Fame https://www.invent.org/inductees/carolyn-bertozzi
6. Stanford News Q&A with Dr.carolyn-bertozzi




ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

మమత-సమత-మానవత
www.gurajada.org

## ధన్యోస్మి



ముందుగా జనవరి – మార్చ్ 2023 సంచికలో ప్రచురణ కోసం మంచి వ్యాసాలు ప్రత్యేకంగా రాసి పంపిన వ్యాసకర్తలకి శతకోటి నమస్సులు.

ఈ సంచిక వెలువరించడంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సహకరించిన వారందరో, వారందరికీ వందనములు.

ఆచార్య దార్ల వేంకటేశ్వర రావు గారు, డా. వి. ఆర్. రాసాని గారు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారు ప్రకాశిక సంపాదక వర్గం లో చేరారు. వారికి ధన్యవాద పూర్వక ఆహ్వానాలు పలుకుతున్నాను.

ఈ సంచిక నుంచి కథలు, కవితలు, పరిశోధనా వ్యాసాలు ప్రచురిస్తాము. ప్రచురణ కోసం కథలు, కవితలు, పరిశోధనా వ్యాసాలు పంపమని రచయితలను కోరుతున్నాము.

డా. రాసాని గారి నిర్వహణలో ఈ సంచిక నుండి "మేటి కథలు– లోతు వ్యాఖ్యలు" శీర్షికలో ప్రముఖుల కథలు వాటిపై వ్యాఖ్యానాలు ప్రచురిస్తున్నాము. భావి తరాలకు ఇవి మార్గదర్శకంగాను, ఉపయుక్తంగానూ ఉంటాయని ఆశిస్తాను.

ఎప్పటిలాగే పాఠకులు ఈ సంచిక ను కూడా చదివి ఆనందిస్తారని ఆశిస్తాను.

చదవండి, చదివించండి

భవదీయుడు
**ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ**
ప్రధాన సంపాదకులు

